Photo by R. Ramanujan



బహుమతి
పొందిన వ్యాఖ్య

వెలకు దొరకని మందు...

పంపినవారు:
బి. కృష్ణమూర్తి - కారంచేడు

# చందమామ

## ఈ సంచికలో కథలు వింతలు - విశేషాలు

★



ఇవి గాక :

చిత్రకథ, ఫోటో శీర్షికల పోటీ, మొదలైన మరి ఎన్నో ఆకర్షణలు.



డిసెంబరు
విడుదల





జయంతీ పిక్చర్సు వారి

# పెళ్లినాటి ప్రమాణాలు

ఆలుమగలు ఆనందించవలసిన ఆదర్శ చిత్రము

నిర్మాత - దర్శకుడు
**కే.వి.రెడ్డి** B.Sc.(HONS)

వాహినీ విడుదల

BAKTHA

హైద్రాబాద్, తెలంగాణాలకు : నవయుగ ఫిలిమ్స్, సికంద్రాబాద్.

# పాఠకులకు విజ్ఞప్తి

చందమామలో ప్రచురితమవుతున్న బేతాళకథలు మీరు నెలనెలా చదువుతున్నారు. వీటిలో చాలా భాగం కల్పితాలు. బేతాళకథల రూపంలో చెప్పటానికి వీలున్న ఇతర కథలను ఈ శీర్షికలో ప్రచురిస్తూ వస్తున్నాము. ఇదేరీతిగా బేతాళకథలుగా ప్రచురించటానికి వీలున్న కథలు మీకు తెలిసిఉంటే మాకు పంపండి. పనికివచ్చేపక్షంలో, అవసరమైతే సంస్కరించి, బేతాళకథల శీర్షికలో ప్రచురించగలము.

—సంపాదకుడు,
"చందమామ"

ఇప్పుడే ప్రారంభించండి

# దంతక్షయమును నివారించుటకు

★

## ఆనంద దాయకమైన మార్గము!

★



అశ్చర్యము : ప్రతి భోజనము తరువాతను లిస్టరిన్ టూత్‌పేస్టుతో బ్రషింగు చేసుకుంటే, దంతక్షయ నివారణకు ఎన్నో విధాల తోడ్పడుతుంది.

1. అది వినాశకారణమైన విషక్రిములను ప్రత్యక్షంగా పారద్రోలుతుంది.
2. అది క్రిములను అంటివుంచు పళ్ల గారను తొలగిస్తుంది.
3. అది నోటినుండి స్రవించు ద్రవములనుకూడ అరికట్టుతుంది.

అవును....లిస్టరిన్ టూత్‌పేస్టు, ఈ పనులన్నీ నెరవేర్చడమే గాక, పళ్లను పూర్తిగా శుభ్రపరుస్తుంది ; మీ చిరునవ్వును సహజసుందరంగా చేస్తుంది—దాని చక్కటి పరిమళము బిడ్డలకు ఎంతో యిష్టము

దంతక్షయమును నివారించండి...పరిశుభ్రమైన లిస్టరిన్ టూత్‌పేస్టను ప్రతి భోజనము తరువాతను వాడండి—ఇది బిడ్డలకు అతి ఆవశ్యకము!

సుప్రసిద్ధ లిస్టరిన్ ఆంటిసెప్టిక్‌ను చేసినవారే దీనినీ తయారుచేశారు.




దంతక్షయ నివారణకు
ఇదే సౌఖ్య మార్గము

14S

**Made by the makers of famous LISTERINE ANTISEPTIC**

అత్యంత సౌందర్యానికి...




# రెమి
ప్రోడక్ట్సు

529



# చందమామ

సంచాలకుడు : 'చక్రపాణి'

లోగడ "చందమామ" లో మీరు "పంచతంత్రం" తాలూకు "మిత్రభేదం", "మిత్రసంప్రాప్తి", "కాకోలూకీయం" చదివారు. ఈ సంచిక నుంచీ "లబ్ధప్రణాశం" ఆరంభమవుతున్నది.

పాలకులు తమ పరిపాలనలో ఉండే అతిక్షుద్రుల క్షేమాన్నికూడా శ్రద్ధగా గమనించాలి. అది వారి విధి. ఆ విధిని నిర్వర్తించలేని పాలకులు గండభేరుండపక్షి [ "పికిలి పిట్ట"—42 పేజీ ] లాగా నష్టపడతారు; వారు స్వతః బాధ్యత ఎరిగినవారైతే [ "రాజధర్మం"—పేజీ 17 ] లాగా తమ తప్పును సరిదిద్దుకుంటారు.

"తుఫాను" షేక్స్పియర్ నాటక కథ. ఇందులో మనిషికి ప్రకృతిపైగల శక్తులు చిత్రించబడ్డాయి. "భయంకర మానవుడు" అన్న కథలో మానవుడి యుక్తికి సింహం మొదలైన జంతువులు సయితం ఎంత లోకువో నిరూపించబడింది.

"నవరసాలు" [బేతాళ కథ] లో మామూలు అనుభూతికీ రసానుభూతికీ ఉండే తేడాను మీరు గమనించగలుగుతారు.

"రూపధరుడి యాత్రలు" అనే గ్రీకు పురాణగాథ ఈ సంచికతో ముగుస్తున్నది. దీనిని గ్రీకుభాషలో రచించినవాడు "హెూమర్."

సంపుటి 23 ★ డిసెంబర్ 1958 ★ సంచిక 6



# అట్టవిూదిబొమ్మ

దుర్యోధనాదులు వెళ్ళిపోయాక కృష్ణుడు కౌరవసభలోని పెద్దలతో, "ఒక్క దుర్యోధనుడికోసరం ఇక్కడ చేరిన రాజులందరూ యుద్ధానికి బలి కావటం ధర్మం కాదు. దుర్యోధనుని మీరు పెడరెక్కలు కట్టి బంధించి పాండవులకు వప్పగించి వారితో సంధి చేసుకోండి," అని చెప్పాడు.

శకుని కర్ణులతో దుర్యోధనుడు మంత్రాంగం ఆలోచించే సమయంలో దుశ్శాసనుడు, "నిన్ను బంధించి పాండవులకు వప్పగించుతారట. మా ముగ్గుర్నీ కూడా అలాగే చేస్తారేమో!" అన్నాడు.

దుర్యోధనుడు మండిపడి, "ఈలోగా మనమే ఆ కృష్ణుణ్ణి బంధించుదాం. అంతటితో పాండవులు మతిపోయి, అరణ్యాలలోకి పారిపోతారు!" అన్నాడు.

దుష్టచతుష్టయం చేసే ఆలోచన సాత్యకికి తెలిసింది. అతను తమ పరివారాన్ని సభాద్వారంవద్దకు వచ్చే ఏర్పాటు చేసి, సభలోకి వెళ్ళి కృష్ణుడితో, "దుష్టచతుష్టయం నిన్ను బంధించే ఆలోచన చేస్తున్నారు!" అని చెప్పాడు.

పెద్దలంతా కంగారుపడ్డారు. వారు దుర్యోధనుడికోసం కబురు చేసి పిలిపించారు. కృష్ణుడు దుర్యోధనుడితో, "నేను దుర్బలుణ్ణి అనుకుని నన్ను బంధించటానికి ప్రయత్నిస్తున్నావా? నా విశ్వరూపం చూడు!" అంటూ సమస్త లోకాలనూ, దేవగణాలనూ, ఆదిత్యులనూ, ఋషిగణాలనూ తనలో చూపాడు. గుడ్డివాడైన ధృతరాష్ట్రుడుకూడా విశ్వరూపాన్ని చూడగలిగాడు.

తరవాత కృష్ణుడు సభనుంచి బయటికి వచ్చాడు. ఆయన కుంతిని చూసి ఆమెవద్ద సెలవు పుచ్చుకుని, భీష్మద్రోణాదులందరికీ వీడ్కోలు చెప్పి, రథం ఎక్కుతూ కర్ణుణ్ణి తనవెంట ఎక్కించుకున్నాడు.

రథం నిర్జన ప్రదేశాన్ని చేరుకున్నాక కృష్ణుడు కర్ణుడితో, "నీవు కుంతి పెద్దకుమారుడవు. పాండవులు నీకు తమ్ములు. అందుచేత నాతో వచ్చేసి నీ తమ్ములతో చేరిపో. వారు నిన్ను తమ తండ్రిలాగా గౌరవిస్తారు," అన్నాడు.

కర్ణుడు "దేవా, నన్ను చేరదీసి పెంచిన తల్లిదండ్రులనూ, నన్నే నమ్ముకుని యుద్ధానికి దిగుతున్న దుర్యోధనుణ్ణీ కాదని పాండవుల పక్షానికి రాలేను. వారికి యుద్ధంలో విజయం లభించేటట్టుగా చెయ్యి. అదే నా కోరిక!" అన్నాడు.

తరవాత కృష్ణుడు కర్ణుడికి వీడ్కోలు చెప్పి పాండవులవద్దకు తిరిగి వచ్చాడు.

# ఉత్తమ వైద్యుడు

ఒక నగరంలో ఒక ప్రసిద్ధుడైన వైద్యుడుండేవాడు. ఆయన చేసిన అద్భుతమైన చికిత్సలను గురించి జనం తెగ చెప్పుకునేవారు. ఆయన చాలా డబ్బు గడించాడు.

ఒకనాడు ఆయనను మిత్రులు కొందరు మెచ్చుకోసాగారు. ఆయన వారితో, "మీకొక రహస్యం చెప్పనా ? నేను నిజంగా అధమరకం వైద్యుణ్ణి," అన్నాడు.

మిత్రులు నిర్ఘాంతపోయి, "అది ఎన్నటికీ నిజంకాదు ! ఆ మాట ఈ ఊళ్ళో ఎవరూ నమ్మరు !" అన్నారు.

"కాని వాస్తవం !" అన్నాడు వైద్యుడు. "వినండి. మేము ముగ్గురం అన్నదమ్ములం. ముగ్గురమూ వైద్యులమే. మా పెద్దన్న ఉత్తమ వైద్యుడు. ఆయన రాబోయే రోగాలను ముందుగానే గుర్తించి, ఆహారం మార్చి రోగాలు రాకుండా చేయగలిగేవాడు. ఆయన వైద్యుడన్న విషయంకూడా ప్రజలకు తెలీదు. మా రెండో అన్న మధ్యమతరగతి వైద్యుడు. ఆయన రోగాన్ని అంకురంలోనే గుర్తించి నిర్మూలించేవాడు. అందుచేత ఆయన చిన్నరోగాలు కుదర్చగలడని జనం గుర్తించారు. పోతే నేను అధమతరగతికి చెందిన వైద్యుణ్ణి. రోగం ముదిరినదాకా రోగనిదానం చెయ్యలేను. ఆ తరవాత అంతులేని కషాయాలూ, కుప్పెకట్లూ, మాత్రలూ గుప్పించి రోగంతో హోరాహోరి యుద్ధంచేసి ఎలాగో నెగ్గుతాను. రోగం మరీ ముదిరి మందులతో నయం కాకపోతే శస్త్రచికిత్సలు కూడా చేస్తాను. అందుకే గొప్ప వైద్యుడని నాకు పేరు వచ్చింది !"





# తప్పించుకుపోయిన దొంగ




పూర్వం గ్రీసు దేశంలో ఒక రాజుండేవాడు. అతను సముద్రతీరాన గల ఒక కొండపైన చిన్న దుర్గంలో ఉంటూ, ఆ తీరానికి వచ్చే నౌకలను కొల్లగొట్టి ధనం కూడబెట్టసాగాడు. ఈ రాజు చాలా జిత్తులమారివాడు. కపట వ్యూహాలు పన్నటంలో అందెవేసినచేయి. అందుచేత దోపిడీలు చేసి కూడబెట్టిన ధనంతో ఒక గొప్ప రాజభవనం నిర్మించి గొప్పరాజు ననిపించుకోవాలని అతని ఉద్దేశం.

ఈ గ్రీకు రాజుకు అనేక ఆవుల మంద లుండేవి. ప్రస్తుతం అతని సంపద అవే. కాని ఉన్నట్టుండి ఒక్కొక్క మందే మాయం కాసాగింది. పశువులకాపర్ల నడిగితే, "మహారాజా, ఈ కొండ అవతలివేపున ఒక మాయదారివాడు ఉన్నాడు. అక్కడ వాడికి చాలా పశువులకొట్టాలున్నాయి. వాడు మంత్రాలూ, మర్మాలూ నేర్చినవాడు. వాడే మన మందలను కాజేస్తున్నాడని మాకు అనుమానంగావున్నది. తమరు స్వయంగా విచారించండి!" అన్నారు.

రాజు మంత్రగాడుండే చోటుకు దారి తెలుసుకుని బయలుదేరి వెళ్ళాడు. తన పశువులు ఆ దారిన వెళ్ళినట్టు ఆయనకు దారిపొడుగునా ఆనవాళ్ళు కనిపించాయి.

మంత్రగాడు రాజును గౌరవంగా ఆహ్వానించి ఆయన వచ్చిన పని తెలుసుకున్నాడు. "తమ ఆవులు పోయాయా? నా ఆవుల్లో కలిశాయని అనుమానిస్తున్నారా? తప్పక వెతుక్కోండి. ఎందుచేతనంటే ఒకటీ రెండూ కలిస్తే కలిసి ఉండవచ్చు! ఇంతకూ తమ ఆవులు ఏ రంగువి?" అని ఆ దొంగ వాడు అడిగాడు.

"తెల్లవి. నా ఆవులన్నీ తెల్లవే!" అన్నాడు రాజు.

"మీ అనుమానమూ నా అనుమానమూ తీరిపోయింది. నా దగ్గిర నల్లఆవులు తప్ప

ఎల్. ఆదినారాయణరావు



లేవు. కావలిస్తే తమరే వచ్చి చూసుకోండి!" అంటూ ఆ మాయదారి దొంగ రాజును తన పశువులకొట్టాలలోకి తీసుకుపోయి చూపాడు. అక్కడ అంతులేని ఆవులున్నాయి; అయితే మంత్రగాడు మొదట్లోనే రాజుకు చెప్పినట్టు అవి అన్నీ నల్లవే!

చేసేది లేక రాజు తన ఇంటికి తిరిగి వచ్చి, "ఒరే, ఎందుకైనా మంచిది. ఆ దొంగవెధవపైన ఒక కన్నువేసి ఉంచండి!" అని తన పశులకాపర్లతో అన్నాడు.

వాళ్ళు ఎంత జాగర్తగా ఉన్నప్పటికీ మళ్ళీ రెండు మందలు మాయమయాయి. రాజు ఇంకొకసారి దొంగవద్దకు వెళ్ళాడు. ఆయనను చూసి దొంగ, "మళ్ళీ తమ పశువులు తప్పిపోయాయా ఏమిటి?" అని ఆదుర్దాగా అడిగాడు.

"అవును. నీ పశువులతో చేరాయేమో నని చూడవచ్చాను," అన్నాడు రాజు.

"చిత్తం, అలాగే చూడండి. కాని తమ పశువులు తెల్లవా, నల్లవా?" అని దొంగ అడిగాడు.

"అన్నీ నల్లవే!" అన్నాడు రాజు.

"చిక్కే వచ్చిందే! నావీ నల్లవే! మీవి కొమ్ములున్నవా, లేనివా?" అని దొంగ అడిగాడు.



"నా పశువులన్నిటికీ కొమ్ములున్నాయి," అన్నాడు రాజు.

"అయితే చూడటం అనవసరం. నావద్ద ఉన్న పశువులకు వేటికీ కొమ్ములు లేవు. కావలిస్తే వచ్చి చూసుకోండి!" అంటూ పశువుల దొంగ రాజుగారిని తన పశువులశాలకు తీసుకుపోయాడు. అక్కడ పూర్వంకంటే కూడా ఎక్కువ పశువులున్నట్టు రాజుకు తోచింది. అన్నీ నల్లరంగువే; ఒక్కదానికీ కొమ్ములు లేవు.

చేసేది లేక రాజు తన ఇంటికి తిరిగి వచ్చేశాడు. కిందటిసారి చూసినప్పుడు దొంగ తాలూకు పశువులన్నిటికీ కొమ్ములున్నట్టు



రాజుకు జ్ఞాపకం. అయితే ఆ విషయం రుజువుచెయ్యటం ఎలా ?

యుక్తిపరుడు కావటంచేత రాజు ఈసారి దొంగను పట్టటానికి ఒక ఉపాయం ఆలోచించాడు. ఆయన తన నౌకర్లను పిలిచి వాళ్లచేత తనవద్ద మిగిలిన పశువులన్నిటి గిట్టలలోనూ గాట్లు కొట్టించాడు.

మరి కొద్దిరోజులకల్లా రాజుగారి మంద మరొకటి మాయమయింది. ఈసారి రాజు తన పశువులకాపర్లనందరినీ వెంటబెట్టుకుని దొంగ ఉండే చోటికి వెళ్ళాడు. రాజు వెంట ఉన్న బలగాన్ని చూసి దొంగ నిర్ఘాంత పోయాడు. అతను రాజుతో, "ఇంకా తమ పశువులు దారి తప్పిపోతూనే ఉన్నాయా ? ఆశ్చర్యంగావుంది," అన్నాడు.

"అవును, ఈసారి వాటిని పట్టుకుంటాను," అన్నాడు రాజు.

"మీ పశువులు నల్లవా, తెల్లవా ?" అన్నాడు దొంగ.

"నల్లవీ కావు, తెల్లవీ కావు, అన్నీ మచ్చలవి ! ఆ పశువులన్నీ నీవద్దనే ఉన్నాయి," అన్నాడు రాజు.

"చిక్కే వచ్చిందే ! నావికూడా మచ్చలవే మరి !" అన్నాడు దొంగ.

"అదివరకల్లా నీ పశువులు నల్లనివి ! అవి ఎప్పుడు మచ్చలవి అయాయి ?" అన్నాడు రాజు.

"చిత్తం, నా ఆవులు నల్లనివే అయినా అన్నిటికీ అంతో ఇంతో మచ్చలున్నాయి. తమరా సంగతి సరిగా గమనించి ఉండరు. తమ పశువులకు కొమ్ములున్నాయా, లేవా ?" అన్నాడు దొంగ.

"ఈసారి అలా మోసపోను. నా పశువుల కున్న గుర్తులేవో నా మనుషులకు తెలుసు. వాళ్ళు లోపలికి వెళ్ళి ఆ గుర్తులనుబట్టి నా ఆవులను పోల్చుకుంటారు. నీ దొంగతనం బయటపడుతుంది. ఇప్పటికైనా నిజం ఒప్పుకో !" అన్నాడు రాజు.



దొంగ రాజుకాళ్ళు పట్టుకుని, "మన్నిం చండి, మహారాజా. తమ పశువుల మందలు ఎనిమిదింటిని కాజేశాను. నా దొంగతనం రుజువుచేయ నవసరం లేదు. మీ మంద లను మీకు వప్పజెబుతాను. నన్నింతటితో వదిలివెయ్యండి!" అన్నాడు.

"నన్ను ఎలా భ్రమపెట్టగలిగావో నిజం చెప్పేస్తేగాని నిన్ను క్షమించను!" అన్నాడు రాజు కోపంగా.

"మహారాజా, నాకు కనుకట్టువిద్య తెలుసును. నాదగ్గిర ఒక మంత్రపు రేకున్నది. దాని సహాయంతో నల్లటి వస్తువులను తెల్లగానూ, తెల్ల వస్తువులను నల్ల గానూ చూపగలను; ఉన్నవి లేనట్టూ లేనివి ఉన్నట్టూ చూపగలను. అందులో బ్రహ్మ విద్య ఏమీ లేదు. ఆ రేకు మీచేతి కిస్తే మీరుకూడా ప్రపంచాన్ని కనుకట్టు చేయ వచ్చును!" అన్నాడు దొంగ.

"ఆ రేకు నాకిచ్చేస్తే నిన్ను క్షమించు తాను!" అన్నాడు రాజు. ఆ రేకు సహా యంతో తాను ఇంకా పెద్దదోపిడీలు చేసి మరింత గొప్ప రాజు కావచ్చునని అయ నకు తోచింది.

"ఆ ఎదురుగా కనబడే కొండశిఖరం మీద ఒక రాళ్ళగుట్టలో దాన్ని దాచాను, మహారాజా. మీరు ఈ క్షణం అక్కడికి పోతే



దొరుకుతుంది. కాని మీకెందుకు వచ్చిన శ్రమ. నా నౌకరు ముసలయ్య ఉన్నాడు. వాడికి దాని సంగతి అంతా తెలుసు. వాణ్ణి ఇప్పుడే పంపించి రేకు తెప్పిస్తాను. మీరు ఒక్క ఘడియ ఇక్కడే చెట్లకింద విశ్రాంతి తీసుకోండి," అంటూ దొంగ తన కుటీరం లోకి వెళ్ళాడు.

తరవాత కాస్సేపటికి ఒక ముసలివాడు తెల్లని జుట్టూ, తెల్లని గడ్డముతో సహా కుటీ రంలోనుంచి బయటికి వచ్చి రాజుగారి పరి వారంమధ్యగా బయలుదేరి, ఎదురుగా కని పించే కొండకేసి వెళ్ళాడు.

ఒక ఘడియ గడిచింది, రెండు ఘడి యలు గడిచాయి. కుటీరంలోకి వెళ్ళిన దొంగ మళ్ళీ బయటికి రాకపోవటం చూసి ఏదో మోసం జరిగిందనుకుని రాజు తన మనుషు లను కుటీరంలోకి పంపాడు.

కుటీరం ఖాళీగా ఉన్నది. అందులో ఎవరూ లేరు.

"ఆ దొంగవెధవే ముసలివాడి రూపంలో బయటికిపోయి ఉండాలి. వాడికి నలుపును తెలుపుగా చూపటం తెలుసు. వాడి నల్లజుట్టూ, నల్లగడ్డమూ మనకు తెల్లగా కనబడేసరికి మనం వాణ్ణి చూసి ముసలివాడనుకున్నాం. మన కళ్లలో కారం గొట్టి దొంగవెధవ తప్పించుకుపోయాడు. పోతేపోయాడు, వాడి పశువులనుకూడా మనమే తోలుకుపోదాం!" అన్నాడు రాజు తన మనుషులతో.

ఈ విషయంలోకూడా రాజు పొరపడ్డాడు. ఎందుచేతనంటే, ఎంచి చూడగా, దొంగ వాడి పశువుల కొట్టాలలో ఎనిమిదిమందల పశువులే ఉన్నాయి. ఒక్కటికూడా ఎక్కువ లేదు. ఉన్నవన్నీ రాజుగారివే! దొంగవాడికి అసలు పశువులే లేవు. వాడు కాస్త తప్పించుకు పారిపోయాడు.

చేసేది లేక రాజు తన మందలను తోలించుకుని తన ఇంటికి వెళ్ళిపోయాడు.






## 6

[సర్పకేతుడు మరికొంత కొత్తసైన్యంతో నగరం ప్రవేశించటంవల్ల, చంద్రవర్మ వ్యూహం విఫలమయింది. అతడూ, సుబాహుడూ గుర్రాలమీద నగరం వదిలి కొండలకేసి పారిపోసాగారు. కొండలలో శత్రువులు వారిద్దరినీ చుట్టుముట్టారు. చేసేది లేక చంద్రవర్మా, సుబాహుడూ కొండదిగువను ప్రవహిస్తున్న ఒక నదిలోకి దుమికారు. తరవాత—]

చంద్రవర్మ నదీప్రవాహంలో ఈదేందుకు ప్రయత్నించాడు. కాని, ప్రవాహవేగం అతణ్ణి అటూ యిటూ విసిరికొట్టసాగింది. కొండ అంచున వున్న శత్రుసైనికులు గోలగా మాట్లాడుకోవటం అతడికి వినిపిస్తూనేవుంది. సుబాహుడుకూడా తనతోపాటు నదిలోకి దూకాడా? లేక శత్రువుల చేత చిక్కాడా?

చంద్రవర్మ యిలాంటి ఆలోచనలతో సతమతమవుతూ, నదీజలంలో వేగంగా కొట్టుకుపోసాగాడు. ఈదటానికి అతడు చేసిన ప్రయత్నం ఫలించలేదు. కొద్దిసేపటిలోనే అతడు ఆయాసంతో సొమ్మసిల్లిపోయాడు. ఇక నాకు చావు తప్పదు, అనుకుంటూ అతడు కడసారిగా మునిగిపోకుండా వుండేందుకు గట్టిప్రయత్నం చేసి నిస్పృహతో కళ్లు మూసుకున్నాడు.

చంద్రవర్మ తిరిగి కళ్లు తెరిచేసరికి సూర్యుడు ఆకాశమధ్యంలో వున్నాడు. చుట్టూ చిత్తవొత్తుగా పెరిగిన చెట్లతో భయంకరంగా వున్న అడవి. తను ఒకానొక నీటి




మడుగు ఒడ్డున పడివున్నట్టు అతడు గ్రహించాడు. తను అదృష్టవశాత్తూ నదీజలంలో మునిగిపోకుండా, దాని పాయలలో ఒకదానివెంట కొట్టుకువచ్చి యిక్కడికి చేరినట్టు అతడు తెలుసుకున్నాడు. ఆ వెంటనే అతడికి సుబాహుడు గుర్తుకువచ్చాడు. చంద్రవర్మ లేచి కూర్చుని అతడికోసం చుట్టూ కలయచూశాడు. అతడి జాడ లేదు.

కొద్దిసేపటికల్లా చంద్రవర్మను ఆకలి దహించసాగింది. అతడు నీటిమడుగు దగ్గిర నుంచి కదిలి, అల్లంత దూరంలో వున్న చెట్లను సమీపించాడు. ఆ చెట్లలో కొన్ని ఫలభారంతో భూమికి వంగి వున్నవి. ఆకలిగొనివున్న చంద్రవర్మ చేతికి అందిన పండ్లను కోసుకుని ఆత్రంగా తిన్నాడు. ఆ క్షణంలో అతడికి యీ అడవి ఎంత భయంకరమైనదన్న జ్ఞానం లేదు.

ఆకలి చల్లార్చుకున్న తరవాత చంద్రవర్మ తన పరిస్థితిని గురించి ఆలోచించసాగాడు. తను శత్రువులచేత బడకుండా తప్పించుకోగలిగాడు, అది గొప్ప అదృష్టమే. కాని, యిప్పుడు తను వున్న అడవి ప్రాంతం ఎలాంటిది? ఇందులో మానవమాత్రు లెవరైనా వున్నారా? లేక క్రూరమృగాలకూ, భూతప్రేతాలకూ ఉనికిపట్టయిన చోటా? ఈ విధంగా ఆలోచిస్తూ చంద్రవర్మ అడవిలోకి బయలుదేరాడు. అతడు చెట్ల కిందుగా కొద్దిదూరం నడిచేంతలో, తీవ్రమైన పెనుగాలి తాకిడికి అల్లల్లాడినట్టుగా అడవిలోని చెట్లన్నీ ఒక్కసారి భూమిమీదికి వరిగి, అంతలోనే దేహాన్ని గగుర్పొడిపించేలా వికృతంగా ఈలలూ, అరుపులూ ప్రారంభించినై.

ఈ వింత చూస్తూనే చంద్రవర్మ స్థాణువులా అయిపోయాడు. చెట్లకొమ్మలు చేతులు చాచినట్టుగా అతడికేసే వంగి కీచుగొంతులతో అరవసాగినై. అతడు ఎటు తిరిగితే అటుకేసి ఆ కొమ్మలు వంగి, అతణ్ణి పట్టుకోబోతున్నట్టుగా నటించటం ప్రారం



భించినై. తను ఏదో మంత్రగ్రస్తమైన అడవిని ప్రవేశించినట్టు చంద్రవర్మ గ్రహించాడు. ఇప్పుడు యీ సంకటంనుంచి బయటపడటం ఎలా? అతడు ఒరలో వున్న కత్తి దూసి, తనకేసి చెవులు చిల్లులుపడేలా అరుస్తూ, వంగుతున్న చెట్టుకొమ్మను ఒక్క దెబ్బతో నరికాడు. తక్షణం పెద్ద మూలుగుతో కలిసి భయంకరమైన కేక వినబడింది. అందుకు ప్రతిగా అగ్నిపర్వతం బద్దలయినంత వేడిమితో గాడ్పులు ప్రారంభమై, ఆ ప్రదేశం మార్మోగేలా బుసలు వినిపించినై.

చంద్రవర్మ నిలువెల్లా వణికిపోయాడు. కాని, అంతలోనే అతడికి ఎక్కడ లేని తెగింపూ, సాహసం వచ్చింది. అతడు కత్తిని పిడికిట బిగించి పాముబుసల్లాంటి ధ్వనీ, వేడిగాలీ వస్తున్నవైపుకు తిరిగాడు. అతడి కళ్లకు చెట్లకిందుగా పాకి వస్తున్న పెద్ద మూడుతలల సర్పం ఒకటి కనిపించింది. అది నాలుకలు చాస్తూ, పెద్దగా బుసలు కొడుతూ అతణ్ణి సమీపిస్తున్నది. వేటుకు ఒక్కతల.... అనుకుంటూ చంద్రవర్మ కత్తి ఎత్తాడు. అంతలోనే అడవిలోపలినుంచి వికృతమైన కంఠస్వరంతో, అప్యాయత ఒలికే మాటలు వినిపించినై:

"నాయనా, కాలనాగూ! ఆ మానవుణ్ణి చంపకు. కష్టాలలో దిక్కు తెలీక మన



దగ్గిరకు వచ్చినవాడు. అతిథి సమానుడు. క్షేమంగా నా దగ్గిరకు తీసుకురా!"

ఆ మాటలు వింటూనే మూడుతలల కాలసర్పం, చంద్రవర్మకు అంత ఎడంలో ఆగిపోయింది. అడవిలోని చెట్లన్నీ నిశ్శబ్దంగా వూరుకున్నవి. గాలి స్తంభించిపోయింది. చంద్రవర్మ ఆశ్చర్యంగా సర్పంకేసి చూశాడు.

కాలసర్పం తనను అనుసరించమన్న సూచనగా మూడుతలలనూ ఒకసారి చంద్రవర్మకేసి ఆడించి, అడవిలోకి బయలు దేరింది. చంద్రవర్మకు మార్గాంతరం కనిపించలేదు. ఈ అడవి ప్రాంతాన్నంతా తమ మంత్రబలంతో ఎవరో వశపరుచుకుని వున్నారు. ఆ గొంతు ఆ వ్యక్తిదే. తను ఆ మూడుతలల సర్పాన్ని అనుసరించి వెళ్లక తప్పదు. పారిపోవటానికి ప్రయత్నిస్తే తనకు యీ నిమిషానే చావు మూడుతుంది.

చంద్రవర్మ యిలా ఆలోచిస్తూ, కత్తిని మరింత గట్టిగా గుప్పెట బిగించిపట్టుకుని కాలసర్పాన్ని అనుసరించి నడవసాగాడు. కొంతదూరం వెళ్లేసరికి ఎదురుగా చెట్ల మధ్య, గద్దతలా, రెక్కలూ—సింహశరీరంతో వున్న ఒక పెద్ద వికృతాకారం కనిపించింది. సర్పం దాని ముందుకు వెళ్లి ఆగి, మూడుతలలనూ ఒకసారి వంచి పెద్దగా బుసకొట్టింది. మరుక్షణం ఆ వికృతాకారం నిలువునా రెండుగా చీలి పక్కలకు పడిపోయింది. వెంటనే శిథిలావస్థలో వున్న ఒక గృహం, దాని వాకిట తెల్లని జుట్టుతో, ముడతలు పడిన శరీరంతో నడుం వంగివున్న ఒక స్త్రీ చంద్రవర్మకు కనిపించారు.

చంద్రవర్మకు నోట మాట రాలేదు. ఆ స్త్రీని చూస్తూనే, యీమె పిశాచా, మానవ స్త్రీయా అనుకున్నాడు. అంతలో ఆ స్త్రీ చేతిలో వున్న కర్రను భూమిమీద రెండు మూడుసార్లు గట్టిగా కొట్టి, "కాలనాగూ, యిక నువ్వు పోవచ్చును," అంటూ చంద్రవర్మకేసి తిరిగి, "రా, నాయనా! ఇంట్లోకి రా.

నీకోసం ఎంత కాలంగా ఎదురుచూస్తు న్నాను," అన్నది ఆప్యాయంగా.

"నా కోసమా?" అన్నాడు చంద్రవర్మ ఆశ్చర్యపడుతూ.

"అవును, నాయనా, నీకోసమే! నేను నీకు చేయవలసిన సహాయమూ, నువ్వు నాకు చేయవలసిన సహాయమూ చాలా వుంది" అన్నది ఆ స్త్రీ.

ఆ మాటలతో ఆమె మానవస్త్రీయే అనీ, మాంత్రికురాలనీ చంద్రవర్మ గ్రహించాడు.

"నే నెవరినో నీకెలా తెలుసు? నీ పేరేమిటి?" అంటూ చంద్రవర్మ ఆ స్త్రీకేసి నడిచాడు.

"నాపేరు కాపాలిని. నేను నీకేమీ హాని చేయబోవటంలేదు గనక, ఆ కత్తిని ఒరలో దాచవచ్చును. ఒకవేళ నేను బుద్ధి మార్చు కుని నీకు హాని చేయదలిస్తే, ఆ కత్తి నీ కెందుకూ వుపయోగపడదు. నువ్వు అడ విని ప్రవేశిస్తూనే, నా శక్తిని చూశావు గదా? నోరూ వాయీ లేని చెట్టుచేమలతో మాట్లాడిం చాను. అవే నీదారిని అడ్డగించినవికూడా," అన్నది కాపాలిని.

చంద్రవర్మ ఆ పరిస్థితుల్లో తను నిస్సహా యుణ్ణని గ్రహించాడు. అతడు కత్తిని ఒరలో పెడుతూ, "కాపాలినీ, నేను రాజ్యాన్నీ, స్నేహితులనూకూడా కోల్పోయి







ఈ అడవిప్రాంతాలచేరిన నిర్భాగ్యుణ్ణి. నేను నీ కెలాంటి హాని తలపెట్టబోవటంలేదు. నువుకూడా నాకు ఎలాంటి హానీ చేయవని నమ్మవచ్చునా?" అన్నాడు.

"నేను నీకు హాని తలపెట్టడమా?" అంటూ కాపాలిని ఆశ్చర్యంగా చంద్రవర్మ కేసి చూసి, "చంద్రవర్మా! నేను నా చాతనైన విధంగా నీకు సహాయం చేయదలిచాను. కాని, ఆ సహాయం చేసేముందు, నువ్వు నాకొక సహాయం చేయవలసి వుంటుంది," అన్నది.

తనను పేరుతో కాపాలిని సంబోధించటంతోనే, చంద్రవర్మకు ఆ మాంత్రికురాలి శక్తిసామర్థ్యాలమీద నమ్మకం కుదిరింది. బహుశా, ఆమెకు తననుగురించి సర్వం తెలిసివుంటుంది. ఇప్పుడు వీరపురంలో ఏమి జరుగుతున్నదో, తన సేనాని ధీరమల్లుడూ, సుబాహుడూ ఏమయ్యారోకూడా ఆమె చెప్పగలగవొచ్చు!

చంద్రవర్మ నిర్భయంగా కాపాలినిని సమీపించాడు. ఆమె అతణ్ణి ఎంతో గౌరవంగా ఇంటిలోపలికి తీసుకుపోయింది. ఇంటిగోడలకు అనేక జంతువుల తలలూ, మానవ కపాలాలూ వేలాడుతున్నవి. గోడలో పెద్ద గవాక్షం వున్నచోట వింతగా తయారుచేసిన ఒక బల్లమీద పెద్ద గాజుగోళం ఒకటి తళతళ మెరుస్తున్నది.

కాపాలిని, చంద్రవర్మకు గాజుగోళం వున్న బల్లపక్కగా ఒక మెత్తను చూపిస్తూ, "వర్మా, అక్కడ కూర్చో. నువ్వు నిజంగా నదిలో మునిగిపోకుండా బతికి బయటపడటం నా అదృష్టమే అనుకుంటున్నాను. నేను సాధించవలసిన ఒక కార్యం అయితే నీవల్లనే కావాలి, లేకపోతే మరెవ్వరివల్లా కాదు," అన్నది కాపాలిని.

చంద్రవర్మ గాజుగోళం పక్కగా మెత్తమీద కూర్చుంటూ, "కాపాలినీ, యీ గోళం చాలా వింతగా వున్నది. ఇలాంటివాటి వుప





యోగాన్ని గురించి నేను కొంత వినివున్నాను. ఇందులో మనం మనుష్యుల భూత భవిష్య ద్వర్తమానాలను చూడవచ్చునా ?" అని ప్రశ్నించాడు.

చంద్రవర్మ ప్రశ్న వింటూనే కాపాలిని నిస్పృహగా నిట్టూర్చి. "నాయనా, చంద్ర వర్మా ! నువ్వనుకుంటున్నట్టు, యీ గాజు గోళం నిజంగా భవిష్యత్తులో జరగబోయే దాన్నికూడా చూపించగలిగితే, నేను యింత నిరాశ పడవలసిన అవసరంలేదు. ఈ గోళం భూతవర్తమానాలను మాత్రమే చూపగలుగు తుంది. ఆ కారణంవల్లనే నేను ఒకానొక కష్టసాధ్యమయిన కార్యం సాధించేందుకు నీ సహాయం కోరుతున్నాను," అన్నది.

"ఆ కార్యం అంత కష్టసాధ్యమా ?" అన్నాడు చంద్రవర్మ.

"అవును కష్టసాధ్యమే ; అసాధ్యం మాత్రంకాదు. ఇక్కడికి నూరుయోజనాల దూరంలో శంఖుడు అనబడే ఒకానొక మాంత్రికుడున్నాడు. నువ్వు అతడి మంత్ర గృహంలో జొరబడి, నాకోసం ఒకానొక వస్తువును సంగ్రహించి తేవలసివుంటుంది. ఆ వస్తువుగాని లభ్యమయితే, నేను మరొక వెయ్యేళ్లకాలం యౌవ్వనారోగ్యాలతో సుఖంగా జీవిస్తాను. లేకపోతే..."




కాపాలిని మాట ముగించకుండానే, వెక్కివెక్కి ఏడుస్తూ ; కన్నీళ్లను తుడుచుకోసాగింది. చంద్రవర్మకు ఆ నిమిషంలో ఆమెమీద ఎక్కడలేని జాలీ కలిగింది. ఈ మంత్రగత్తె, తనను మోసంచేసి హతమార్చాలని చూస్తున్నదేమో అన్న సంశయం అంత వరకూ అతడి మనసులో ఏమైనా వుంటే, అది కాస్తా ఆమె దుఃఖాన్ని చూస్తూనే మాయమయింది.

"కాపాలినీ, నేను నీకు నా శాయశక్తులా సహాయంచేస్తాను. కాని, ముందుగా నీవు నాకు ఒక చిన్న వుపకారం చేయాలి. నా వీరపురనగరం యిప్పుడెలా వున్నది ? నా





సేనాని ధీరమల్లుడూ, నా సేవకుడు సుబాహుడూ, బతికే వున్నారా? ఆ వృత్తాంతం, యీ గాజుగోళంలో చూసి చెప్పగలవా?" అని అడిగాడు చంద్రవర్మ.

కాపాలిని చిరునవ్వుతో లేచి గోడకు తగిలించివున్న ఒక పొడవాటి మానవాస్థికను తీసుకుని గాజుగోళాన్ని సమీపించి, ఏదో మంత్రం చదువుతూ దానిని తాకి, "ఇదిగో, నీ వీరపురనగరం!" అన్నది.

భగభగమనే మంటలతో, ఆకాశం ఎత్తు లేచిన పొగలతో, వీధులవెంట దారీ తెన్నూ లేకుండా హాహాకారాలు చేస్తూ పరిగెత్తే పౌరులతో ప్రత్యక్షమైన వీరపురనగరాన్ని చూస్తూనే, చంద్రవర్మ వికృతంగా అరిచి, కళ్ళు మూసుకుంటూ, "కాపాలినీ! ఇక చాలు, ఆ దృశ్యం చూడలేను," అన్నాడు బిగ్గరగా. కాపాలిని మానవాస్థికతో గోళాన్ని తాకిన మరుక్షణం ఆ భీతి కొల్పే దృశ్యం అదృశ్యమైంది. "ఇడుగో, నీ సేనాని ధీరమల్లుడు!" అంటూ కాపాలిని మానవాస్థికతో మరోసారి గాజుగోళాన్ని తాకింది.

చంద్రవర్మ కళ్ళు తెరిచి గోళంకేసి ఆదుర్దాగా చూశాడు. గుట్టలు పుట్టలు, పెద్ద పెద్ద కొండలు.... సేనాని ధీరమల్లుడు తన అశ్వికులతో వేగంగా పోతున్నాడు. అతణ్ణి అన్ని వైపులనుంచీ చుట్టుముట్టుతూ సర్పకేతుడి బలగం సమీపిస్తున్నది. ధీరమల్లుడు తన గుర్రాన్ని నిలువరించి, తన అనుచరులకేసి తిరిగి ఏదో చెప్పి, కత్తి దూసి శత్రువులకు ఎదురుగా తన గుర్రాన్ని దూకించాడు.

"ఇది యివ్వాళ ఉదయం జరిగింది. ఆ తరవాత ధీరమల్లుడేమయిందీ నువ్వు చూడటం మంచిది కాదు," అంటూ కాపాలిని తన చేతగల మానవాస్థికతో గాజుగోళాన్ని తాకింది. వెంటనే ఆ దృశ్యం మాయమయింది.

చంద్రవర్మ నిర్విణ్ణుడై గాజుగోళంకేసి చూస్తూ వుండిపోయాడు. (ఇంకా వుంది)



# రాజ ధర్మం

పూర్వం ఒక ధర్మనిరతుడైన రాజుండేవాడు. ఒకనాటి రాత్రి ఆయనకు ఆరుబయలులో మంట కనిపించింది. ఆయన దగ్గిరికి వెళ్లి చూసేసరికి ఒక పేదస్త్రీ పొయ్యిమీద చట్టిలో నీరు కాయటం కనిపించింది. సమీపంలోనే బక్కచిక్కన పిల్లలిద్దరున్నారు.

"ఎవరు నువ్వు? ఈ రాత్రివేళ నీరు కాస్తున్నావెందుకు?" అని రాజు ఆ స్త్రీని అడిగాడు.

"ఏం చేసేది, నాయనా? చలికాలం. నా బిడ్డలకు ఇంత గంజి అయినా లేదు. అందుచేత వాళ్లకు తాగించటానికి నీరు కాస్తున్నాను. ఈ దేశం ఏలే రాజును చిత్రగుప్తుడు మా కష్టాలను గురించి సంజాయిషీ అడగడా?" అన్నదామె.

"నువ్వూ నీ పిల్లలూ పడే కష్టాలు రాజుకు ఎలా తెలియాలి?" అన్నాడు రాజు.

"అంత తెలుసుకోలేనివాడు రాజెందుకు కావాలి?" అన్నదామె.

రాజు మారు మాటాడక తనవెంట ఉన్న నౌకరుతోసహా ఇంటికి వచ్చి, ఒక బియ్యం మూట తెప్పించి, నౌకరుతో, "ఒరే, దీన్ని నా నెత్తిమీదికి ఎత్తు, ఆ పేదరాలికి ఇచ్చి వద్దాం!" అన్నాడు.

"నేను మోసుకొస్తాను, మహారాజా!" అన్నాడు నౌకరు.

"రేపు నా పాపాలన్నిటినీకూడా నువే మోస్తావ్రా?" అని రాజు నౌకరును అడిగాడు.






పూర్వం నాగపట్టణానికి ఉదయవర్మ అనే సామంతరాజు పాలకుడుగా ఉండేవాడు. ఆయనకు మంత్రశాస్త్రంలో చాలా ఆసక్తి. గొప్ప మాంత్రికుడు కావాలనే ఉద్దేశంతో ఉదయవర్మ అనేక భాషలలో రచించిన మంత్ర గ్రంథాలను అస్తమానమూ చదువుతూ ఉండేవాడు.

ఉదయవర్మ తమ్ముడు శూరవర్మ. అన్నగారు తన చదువులో మునిగి తేలుతూ ఉండటంచేత రాజ్యభారమంతా ఈ శూరవర్మే చూస్తూ, రాజుగారికి ఉండవలిసిన లాంఛనాలన్నీ జరిపించుకుంటూ ఉండేవాడు.

కొంతకాలం గడిచాక శూరవర్మకు దురాశ పుట్టుకొచ్చింది. అందుచేత తన అన్నగారినీ, మూడేళ్ళ వయసు గల ఆయన కుమార్తె చంద్రసేననూ ఎలాగైనా చంపించి తానే రాజవుదామని శూరవర్మ ఆలోచించాడు. ఈ కుట్ర సఫలం కావటానికి జయపాలుడనే చాళుక్యరాజు శూరవర్మకు సహాయపడ్డాడు.

అయితే ఉదయవర్మను చంపెయ్యటం అంత తేలిక పని కాదు. నాగపట్టణ ప్రజలకు ఆయనపైన చాలా అభిమానం. శూరవర్మ రాజ్యలోభంచేత ఆయనను చంపించినట్టు తెలిస్తే వారు శూరవర్మను బతికి ఉండనివ్వరు.

అందుచేత తన అనుచరులలో ధీరసింహుడనేవాణ్ణి పిలిచి శూరవర్మ ఆయనతో, "నా అన్ననూ, ఆయన కుమార్తెనూ నడిసముద్రంలో వదిలిపెట్టిరా. వారిని ఒక నౌకలో తీసుకుపోయి, సముద్ర మధ్యంలో చుక్కానీ తెరచాపా లేని చిన్న తెప్పలోకి ఎక్కించి తిరిగి రా!" అని చెప్పాడు.

అలా చేస్తే ఉదయవర్మా, చంద్రసేనా సముద్రంలో తుఫాను వచ్చి మునిగి పోవ

ఆర్. కోదండరామయ్య

టమో, తిండికిలేక మాడి చావటమో జరుగుతుందని శూరవర్మ ఆశించాడు. కాని ధీరసింహుడి హృదయం మంచిది. అందుచేత అయన తన యజమాని చెప్పిన ప్రకారం ఉదయవర్మనూ, అయన కుమార్తెనూ నడిసముద్రంమీద తెప్పలో దించేటప్పుడు ఆ తెప్పలో వారిద్దరికీ చాలా రోజులపాటు సరిపడే ఆహారమూ, ఉదయవర్మ ఎప్పుడూ చదివే గ్రంథాలూ భద్రంచేసి పెట్టాడు.

ధీరసింహుడి ధర్మాన ఆ తండ్రి కూతుళ్లు దిక్కులేని చావు చావక, కొద్ది రోజులకు ఒక నిర్జనమైన లంకను చేరుకున్నారు.



ఇది ఒక చిత్రమైన లంక. ఒకప్పుడీ లంకలో ఒక మంత్రగత్తె అయిన రాకసి ఉండేది. ఆ రాకసి తన మంత్రశక్తిచేత అనేక భూతాలనూ పిశాచాలనూ లోబరుచుకుని, వాటిచేత వెట్టిచాకిరి చేయించుకునేది. తాను చెప్పినట్టు వినని ఎన్నో పిశాచాలను ఆ రాకసి ఆ లంకలో ఉన్న చెట్లలో బంధించేసింది. ఉదయవర్మ ఆ లంకను చేరటానికి కొద్దిరోజుల క్రితమే ఆ రాకసి చనిపోయింది. ఆమె కొడుకు మందుడనేవాడు దిక్కులేని పక్షి అయిపోయి, ఒంటరిగా ఆ లంకలో తిరుగుతూ వచ్చాడు. ఉదయవర్మ లంకలో అడుగుపెడుతూనే తన మంత్రశక్తిచేత అప్పటివరకూ చెట్లలో బంధించబడి ఉన్న పిశాచాలన్నిటికీ విముక్తి ఇచ్చాడు. ఆ పిశాచాలకు నాయకుడైన ఇల్వాలుడనే వాడు మాత్రం ఉదయవర్మకు అన్నివిధాలా తోడ్పడుతూ ఆ లంకలోనే ఉండిపోయాడు.

తరవాత ఉదయవర్మకు మందుడు దొరికాడు. వాడు చూడటానికి కొండముచ్చుకన్నకూడా వికారంగా ఉండేవాడు, అమిత సోమరి. ఉదయవర్మ వాణ్ణి తెచ్చి తన వెంట ఉంచుకుని కొద్దిరోజుల్లోనే వాడికి మాట్లాడటం నేర్పాడు. అయన ఒక గుహలో తన నివాసం ఏర్పరచుకుని అందులో గదులలాటివి నిర్మించుకున్నాడు.

ఉదయవర్మకోసరం కట్టెలు తీసుకు రావటమూ, ఇతర బండపనులు చెయ్యటమూ మందుడి వంతు. అయితే వాడు చాలా సోమరిపోతు గనక, వాణ్ణి అదిలించీ, బెదిరించీ చెప్పిన పనులు చేయించటం ఇల్వాలుడి వంతు.

మందుణ్ణి ఏడిపించటం ఇల్వాలుడికి చాలా సరదా. ఇల్వాలుడు పిశాచం కావటంచేత ఉదయవర్మకు తప్ప మరెవరికీ మామూలుగా కనిపించేవాడు కాడు. మందుడు పనికి బద్ధకించినప్పుడు ఇల్వాలుడు అదృశ్యంగా ఉండి వాణ్ణి గిల్లేవాడు. లేదా బురదలోకి తోసేవాడు, లేదా ముళ్ల పంది రూపంలో ప్రత్యక్షమై, మీదికి పరిగెత్తుకువచ్చి బెదరగొట్టేవాడు.

ఇలా అనేక సంవత్సరాలు గడిచాయి. చంద్రసేన పెరిగి పెద్దదయింది. ఇప్పుడు ఆమెఅందం వర్ణనాతీతం, కాని అది అడవిన గాచిన వెన్నెలే. ఎందుచేతనంటే ఆమె తన తండ్రిని తప్ప మరొక నరమానవుణ్ణి చూసి ఎరగదు. ఆమెకు తండ్రే గురువుగా ఉండి నేర్చుకోవలిసిన చదువంతా నేర్పాడు.

ఈలోపుగా ఉదయవర్మకూడా గొప్ప మంత్రవేత్తగా తయారయాడు. ఇల్వాలుడి సహాయంతో ఆయన పంచభూతాలపైనా అంతులేని పెత్తనం సంపాయించుకున్నాడు.



ఒకనాడాయన సముద్రంపైన పెద్ద తుఫాను పుట్టించాడు. ఆ తుఫానులో చిక్కుకుని ఒక ఓడ కొట్టుకుంటూ ఉండటం తండ్రి కూతుళ్లు చూశారు. ఆ తుఫాను పుట్టించినది తన తండ్రేనని తెలిసి చంద్రసేన, "నాన్నా, పాపం, ఆ పడవలో ఉన్నవాళ్లను సముద్రంలో ముంచేస్తావా?" అన్నది.

ఉదయవర్మ తన కుమార్తెకు తన కథ యావత్తూ చెప్పి, "అమ్మా, ఆ పడవలో మీ పినతండ్రీ, చాళుక్యరాజు జయపాలుడూ, అతని కొడుకు జయకేతుడూ, మనని నడి సముద్రంలో వదిలిపెట్టిన ధీరసింహుడూ ఇంకా ఇతరులూ ఉన్నారు. వారిని ఇక్కడికి రప్పించటానికే ఈ తుఫాను పుట్టించాను. భయపడకు, వారెవ్వరికీ ప్రాణహాని కలగదు; వారి ఓడకుకూడా ఏ అపాయమూ రానివ్వను," అన్నాడు.

తరవాత ఇల్వాలుడు వచ్చి, ఉదయవర్మతో "దొరా, అంతా మీరు చెప్పినట్టుగానే చేసేశాం. ఓడలోవారంతా తలా ఒక దారీ అయి లంక చేరుకున్నారు. ఎవరికి వారు తాముతప్ప మిగిలిన అందరూ సముద్రంలో మునిగిపోయారనే అనుకుంటున్నారు. ఓడ రేవులో సురక్షితంగా ఉన్నది. అయితే దాన్ని ఎవరికీ కనపడకుండా ఒకచోట దాచాం," అన్నాడు.





"ఇంకా జరగవలిసినపని కొద్దిగా ఉంది. అది కాగానే నీకు పూర్తిస్వేచ్ఛ ఇచ్చేస్తాను. ముందు జయకేతుడున్న చోటికి వెళ్లి వాణ్ణి ఇక్కడికి తీసుకురా!" అన్నాడు ఉదయవర్మ.

ఇల్వలుడు జయకేతుడున్న చోటికి వెళ్లాడు. చాళుక్యరాజు కొడుకైన జయకేతుడు ఎంతో విచారంతో ఒకచోట కూచుని, తనవారంతా సముద్రంపాలైనందుకూ, తాను వచ్చి ఒంటరిగా ఒక నిర్జనమైన లంకలో పడినందుకూ చింతిస్తున్నాడు. ఆ సమయంలో అతనికి ఒక పాట వినిపించింది. అది ఇల్వలుడి పాట.

జయకేతుడా పాట విని వెనక్కు తిరిగి చూశాడు. అతనికి మనిషి ఎవరూ కనిపించలేదు. అందుచేత అతను లేచి పాట వినిపించే దిక్కుగా నడిచివచ్చి చంద్రసేనను చూసి నిర్ఘాంతపోయాడు. అతని కళ్ల కామె మనిషిగా కనిపించలేదు, దేవతగా తోచింది.

"ఈ లంకను పరిపాలించే దేవతా, నన్ను అనుగ్రహించు!" అన్నాడు జయకేతుడు నమస్కరిస్తూ.

"అయ్యో, నేను దేవతను కాను, మామూలు మనిషినే!" అంటూ చంద్రసేన తన కథను ఆ యువకుడికి చెప్పబోయేటంతలో ఉదయవర్మ అడ్డుతగిలి కోపం నటిస్తూ, "ఎవడవోయి నీవు? వేగులవాడి లాగున్నావే? నావెంట రా, నిన్ను నిర్బంధంలో ఉంచి, నీచేత వెట్టిచాకిరి చేయిస్తాను," అన్నాడు.

"ముందు నన్ను గెలిచి తరవాత నా చేత వెట్టి చేయించుకోండి!" అంటూ జయకేతుడు కత్తి దూసి చెయ్యి పైకెత్తాడు. ఇంతలో ఉదయవర్మ తన మంత్రదండం ఆడించేసరికి జయకేతుడు ఎత్తిన చెయ్యి ఎత్తినట్టుగానే ఉండిపోయింది.

"ఆ కుర్రవాడిపైన వృథాగా ఎందుకాగ్రహిస్తావు, నాన్నా? అతను ఏమీ ద్రోహం

చెయ్యలేదు, చేసేవాడిలాగా కూడా కని పించటంలేదు. అతనికి నేను పూచీగా ఉంటాను!" అన్నది చంద్రసేన తండ్రితో.

"కుర్రవాడు ఎర్రగా బుర్రగా ఉన్నాడని భ్రమపడ్డట్టున్నావు. ఇంతకన్న ప్రపంచంలో చాలా అందగాళ్లున్నారు. నీకీవిషయాలు తెలియవు, ఊరుకో!" అన్నాడు తండ్రి.

"ఇంతకన్న అందమైన వాళ్లుంటే ఉండనీ వాళ్లతో నాకేం పని?" అన్నది చంద్రసేన.

అసలు రహస్యమేమంటే చంద్రసేనకు జయకేతుడిపైన తొలిచూపుతోనే ప్రేమ పుట్టుకొచ్చింది. ఆమె బుద్ధి తెలిసినాక చూసిన రెండవ మనిషి ఈ జయకేతుడే. అతన్ని చూసేవరకూ చంద్రసేన అందరూ తన తండ్రిలాగే ఉంటారనీ, అందరి ముఖాలూ కర్కశంగా ఉంటాయనీ, అంద రికీ జీబురుగడ్డాలుంటాయనీ అనుకునేది. అందుచేత ఆమెకళ్లకు జయకేతుడు నవ మన్మథుడిలాగా కనిపించాడు.

జయకేతుడు ఎంతోమంది అందగత్తెలను చూసినవాడై ఉండికూడా చంద్రసేనను చూడగానే ప్రేమించాడు. అంత అంద గత్తెను అతను ఎన్నడూ చూసి ఉండలేదు. జయకేతుడూ, తన కుమార్తె ఒకరినొకరు



ప్రేమించాలనే ఉదయవర్మ ఉద్దేశంకూడా. అయితే ఆ ప్రేమను పరీక్షించే ఉద్దేశంతో ఆయన తన మంత్రశక్తిచేత జయకేతుణ్ణి వశుణ్ణి చేసుకుని, అతనికి దుంగలు పోగు వేసే బరువైన పనిపెట్టాడు.

రాజుకొడుకై పుట్టి నాజూకుగా పెరిగిన జయకేతుడికి ఈ పని చాలా భారంగా తోచింది. అతను వేగంగా దుంగలను పోగు వెయ్యలేకపోయాడు. అందుకు తగ్గట్టుగానే చంద్రసేన అతను పనిచేసే చోటికి వచ్చి, "మా నాన్న చదువులో నిమగ్నుడై ఉన్నాడు. అంతగా కష్టపడకు. పని నింపాదిగా చెయ్యి!" అన్నది.



"అయ్యో, వేగంగా చేస్తేనే తెమలని ఈ పని మెల్లిగా చేస్తే ఎప్పటికి కాను?" అన్నాడు జయకేతుడు.

"కాస్సేపు నువు విశ్రాంతి తీసుకో! నీ బదులు నేను దుంగలు చేరవేస్తాను!" అన్నది చంద్రసేన.

చంద్రసేన రావటంవల్ల పని పాడయింది. ఇద్దరూ కూచుని కబుర్లాడసాగారు. మొదట జయకేతుడు ఆమె పేరడిగాడు. తండ్రి అంక్ష పెట్టినప్పటికీ ఆమె అతనికి తన పేరు చెప్పింది. తరవాత అతను ఆమెతో, "నేను చాళుక్యరాజు కొడుకును. నాకు పట్టాభిషేకం కాగానే నిన్ను నా రాణిని చేసుకుంటాను. ఎందుకంటే నీకంటే సౌందర్యవతి ప్రపంచంలో ఎక్కడా లేదు," అన్నాడు.

"నేను నిన్నూ, మా నాన్ననూ తప్ప మరెవరినీ ఎరగను. అయినా నాకు నిన్ను తప్ప ఇంకెవరినీ పెళ్ళాడాలని లేదు," అన్నది చంద్రసేన.

వీరిద్దరి సంభాషణా చాటునుంచి ఉదయవర్మ విని తృప్తిపడ్డాడు. ఆయన వారి ఎదటికి వచ్చి, "మీ మాటలన్నీ విన్నాను. భయపడకండి, మీకిద్దరికీ నిజంగా ఒకరిపై ఒకరికి ప్రేమ ఉన్నదని నాకు నమ్మకం కుదిరింది. అందుచేత మీ పెళ్ళికి నేను అభ్యంతరం చెప్పను," అంటూ ఆయన అవతలికి వెళ్ళాడు.

తరవాత ఆయన ఇల్వాలుణ్ణి పిలిచి, "నా తమ్ముడూ, జయపాలుడూ ఎక్కడ ఉన్నారు?" అని అడిగాడు.

"దొరా, నేను నా మాయతో వాళ్ళని బాగా హడలగొట్టాను. లంక అంతా తిరిగి అలసిపోయి ఆకలికి మాడుతూ ఒకచోట కూచునేసరికి ఆహారం వారి ఎదట కనపడే లాగా చేశాను వాళ్ళు ఆత్రంగా తినటానికి ముందుకు వచ్చేసరికి ఆహారం మాయమయింది. నేను ఒక పెద్ద పక్షిరూపంలో ప్రత్యక్షమై, 'మీరు పాపాత్ములు! ఏ పాపమూ

ఎరగని ఉదయవర్మనూ, ముక్కుపచ్చలారని ముద్దుకుమార్తెనూ సముద్రంలోకి తోసిన కిరాతకులు!" అని అరిచాను. నా మాటలు వినగానే ఆ ఇద్దరూ బావురుమని ఏడిచి, తాము చేసిన పాడుపనికి ఎంతో తిట్టుకున్నారు. వారు నిజంగా పశ్చాత్తాప పడుతున్నారు, దొరా. వారిని ఇంకా శిక్షించటం ధర్మంకాదు," అన్నాడు ఇల్వాలుడు.

ఉదయవర్మ నవ్వి, "పిశాచానివైన నీకే వాళ్ళపై జాలి గలిగితే అంతఃకరణ గల మనిషినైన నేను వారిని బాధిస్తానా? వారిని వెంటనే ఇక్కడికి చేర్చు!" అన్నాడు ఇల్వాలుడితో.

జయకేతుడిలాగే ఇల్వాలుడి సంగీతం విని శూరవర్మా, జయపాలుడూ, ధీరసింహుడూ అది వినిపించే దిక్కుగా నడిచి ఉదయవర్మ ఉన్న చోటికి వచ్చారు.

వారిలో ఒక్కరుకూడా తమ ఎదట వున్నది ఉదయవర్మ అని గుర్తించలేదు.

ఉదయవర్మ ధీరసింహుణ్ణి సమీపించి ఆలింగనం చేసుకుని తాను ఫలానా అని చెప్పుకుని, "నీ దయవల్లనే నేను ప్రాణాలు దక్కి బతికి ఇక్కడికి చేరుకున్నాను," అన్నాడు. ఆయన ఉదయవర్మ అని తెలియగానే శూరవర్మా, జయపాలుడూ ఆయన కాళ్ళపై పడి క్షమాపణ వేడారు.



"మీరు విచారించకండి. పశ్చాత్తాపం అన్ని తప్పులనూ సరిచేస్తుంది. ఇన్నేళ్ళు ఈ నిర్జనమైన లంకలో గడిపినందుకు నాకు పరిహారం జరగబోతున్నది. నా కుమార్తె నీ కుమారుణ్ణి పెళ్ళాడబోతున్నది," అన్నాడు ఉదయవర్మ జయపాలుడితో.

"నా కుమారుడా? జయకేతుడు చనిపో లేదా? బతికి ఉన్నాడా? ఏడీ వాడు? ఎంత అదృష్టం!" అన్నాడు జయపాలుడు ఆనందోద్రేకంతో.

"రండి చూపిస్తాను!" అంటూ ఉదయ వర్మ తన అతిథులను తన గుహకు తీసుకు పోయి, అక్కడ చదరంగం ఆడుకుంటున్న చంద్రసేననూ, జయకేతుణ్ణీ చూపాడు. తన తండ్రి బతికిఉండటం చూసి జయ కేతుడుకూడా పరమానందం చెందాడు.

"చాలా కష్టాలు గట్టెక్కాయి. కాని మనం ఈ నిర్జనప్రదేశం వదిలి మన దేశా నికి వెళ్ళిపోవటానికి ఓడా, కళాసులూ లేక పోవటం ఒక్కటే పెద్ద లోపం!" అన్నాడు జయపాల మహారాజు.

"మీ ఓడకు ఏ ప్రమాదమూ జరగలేదు. కళాసులందరూ అందులోనే ఉన్నారు. మీ రెప్పుడు తలుచుకుంటే అప్పుడే ప్రయా ణమై పోవచ్చు," అన్నాడు ఉదయవర్మ.

"అయితే అందరమూ కలిసే పోదాం! ఆలస్యం దేనికి?" అన్నాడు జయపాలుడు.

ఉదయవర్మ ఇల్వలుడికి స్వేచ్ఛ ఇస్తూ, "నీ పిశాచాలతో సహా నీ యిష్టంవచ్చిన చోటికి వెళ్ళిపోవచ్చు," అని చెప్పేశాడు; తన మంత్ర గ్రంథాలను ఆ లంకలోనే ఒకచోట పాతిపెట్టేసి, ప్రయాణమయ్యాడు.

కొద్దిరోజులకు వారు స్వదేశం చేరు కున్నారు. నాగపట్టణానికి ఉదయవర్మ మళ్లీ రాజయాడు. తరవాత కొద్దిరోజులకే చాళుక్య రాజ్య సింహాసనంపైన జయకేతుడు కూచు న్నాడు. చంద్రసేనకూ, అతనికీ మహా వైభ వంగా పెళ్లి జరిగింది.






# లబ్ధ ప్రణాశం

పని పడినప్పుడు - తన మతి సెడక
అనువుగా నెరవేర్చు-కొనువాడు ఘనుడు.
అందుల కొక కథ - పొందించి చెప్పి
మందుల తెలివైన - మనుజుల జేయ
ఆ విష్ణుశర్మ, రా-జాత్మజుల్ వినగ
ఈ విధంబున జెప్పె - నిది కథాక్రమము.

*　　*　　*

మును సముద్ర ప్రాంత-ముల నిల్చియుండె
ఘనము నేరేడు వృ-క్షము సుందరమ్ము
విరగాయు నెప్పుడా - వృక్షము పండ్ల
సరిరావు దానికి - స్వర్గ వృక్షములు
వసియించు దానిపై - వానర మ్మొకటి
పసిడిబొమ్మనెలంత - పలుకు దోడుగను.
ఒక తరి మొసలి నీ-డకు వచ్చి నిల్చె
ఇకిలించి కోతి దా-నికి పండ్లు రాల్చె.
"అతిథివై వచ్చితి - వందుకో పండ్లు
అతిపక్వములు మధు-రాంతరమ్ములును."
మొసలి ఆ మాటతో - మోదమ్ము నంది
ససిగల పండ్లతో - సన్మిత్రుడయ్యె.
ఆనాటినుండి వా - రత్యంత మైత్రి
పూని చరించుచు - పొదలుచున్నారు.
ఎన్నెన్ని సంగతు - లెన్ని శాస్త్రాలు
ఎన్ని నీతులు చర్చ - లన్నవే రోజు.
పగలెల్ల అవి గోష్ఠి - పాటించుచుండు
వగలెల్ల మాని సం-బరముతో నేగు.
కోతి రాల్చినయట్టి - కొమరైన పండ్లు
నాతికై మొసలి ది-నము గొనిపోవు.
ఇటులుండ నొకనా డ-దే రీతి మొసలి
బటువైన పండ్లను - పట్టుకపోయి
తన సతికిచ్చి ప్రే-మను తినుమనియె
అనె నామె ఇవి యెట్టు - లందె నీ కనుచు.
అంతట తన నేస్త-మైన వానరము
చెంతకు తా నేగు - చిరమైత్రి చెప్పె.

మొసలి:

కల డొక్క నేస్తు ర-క్తముఖుం డనంగ
లలిత మాతని యెద - లలన ఏమందు!

విద్వాన్ విశ్వం



దినదిన మ్మాతని - దివ్య సన్నిధిని
వినుచుంటి నీతుల - వివిధ శాస్త్రముల
అమృత ఫలమ్ముల - నందిచ్చు నతడు
కమనీయములు వీని - కాన్క తెచ్చితిని

మొసలి భార్య :

అమృతాయమానమ్ము-లగు నీ ఫలాలు
కొమరొప్ప నిచ్చు నా - గుండె యెట్టిదియొ
ఫలములకంటె నీ - చెలికాని గుండె
కలమాగి యుండునని - తలపు జనించె.
అంత కమ్మని గుండె - నటు నిటు నమలి
ఎంతైన రుచి జూడ - నిచ్చయు పొడమె.
కొనిరమ్ము, కొనిరమ్ము - కోతి యెడంద
తనివితీరగ తిందు, - తరలి పొమ్మోయి

మొసలి :

హరహరా ఇది యేటి - అభిలాష నీకు?
కరుణార్ద్రు డాతడు - పరమ మిత్రుండు
చెలికాని బలి గొను - చెన్నటుల్ గలరె?
పలుమాట లేల? ఈ-పని చేయలేను.

మొసలి భార్య :

అడిగిన నెపుడు కా - దనలేదు నీవు
తడవు చేయక పొమ్ము - వడివడి రమ్ము.

మొసలి :

తేలేను, తేలేను, - తేలేను గుండె
ఏల యీ కోరిక - యెలనాగ నీకు?

మొసలి భార్య :

తెలిసె నీ ప్రేమలు - తెలిసె నీ మమత
చెలికాడు కాదు నీ - చెలి కల దచట.
వానరమ్మని చెప్పి, వాని - పెండ్లాము
తో, నేస్తమును కట్టి - తొలగుచున్నావు.
దానికై నీ వింత - తహతహ పడుచు
వాని పేరున పోయి - వచ్చుచున్నావు.
లేకున్న నీవిట్లు లే - దనగలవె?
కాకున్న నన్నిట్లు - కారించగలవె

మొసలి :

ఇది యేమి అన్యాయ - మిది యేమి నింద
సదయాత్ము డతడు, నా - సన్మిత్రు డతడు.

మొసలి భార్య :

కోతి నాతిని నీవు - కోరకయున్న
కోతికై నీకింత - కుతకుత యేల?

వేకువనే లేచి - వెళ్ళి ఆ గుండె
కైకొని రమ్ము నా - కడుపార తిందు.
అది తెచ్చుదాక నే - నాహార మెదియు
ఇది మొదల్ ముట్టను, - ఎదియైన కాని.
ఉపవాసమున ప్రాణ - ముజ్జగించెదను
కపిభార్యనే మెడ - కట్టుకోవయ్యా.

* * *

అను భార్య మొండిప-ట్టును విని మొసలి
అన అడలేక మె-ల్లన బయల్ వెడలె.
కల్లమాటల మిత్రు - కడతేర్చ దలచి
అల్లన వచ్చె మి-త్రావాసమునకు.

వానరుడు :

ఏమోయి మిత్రమా - ఇంత జాగయ్యె
మామూలు వేళ యే - మఱచితి వేల ?

మొసలి :

ఏమందు మిత్రమా - ఏమందునయ్యా
నే మందమతి నంచు - భామ దండించె.
'పోయి తిందువు, రోజు - పోయి వచ్చెదవు?
అయున నొకసారి - ఆదరించితివ ?'
అని మీ వదిన చాల - ఆక్రోశపడియె
తన మఱందిని నిన్ను - కొని రమ్మటంచు

వానరుడు :

వదిన మాట పదారు - వరహాలు సేయు
పదిలమౌ మైత్రి అ-పగిదినే యుండు.



ఇచ్చి పుచ్చుకొనుట-యే మైత్రి యన్న
వచ్చి పోవుటలందె - వఱలు నా మైత్రి.

మొసలి :

ఆమాట కౌనని - అరుదెంచినాను
నీ మోము చూపింపు - భామకీ రోజు

వానరుడు :

సరి దాని కేమిలే - సన్మిత్రు పత్ని
దరిశించి వచ్చి నిఁక - తనియింతు లెమ్ము.

మొసలి :

అట్లైన రమ్మోయి - అలస్యమేల ?
తిట్లైన తప్పు నిఁక - తీసుకచనిన

వానరుడు :

మఱి నీవు జలధిలో - తిరుగంగ గలవు ?
సరె నేను నీతోడ - చనుదెంచగలనె ?




# కాకి చేసిన నేరం

బ్రహ్మదేవుడు భూమ్యాకాశాలనూ, భూమి పైన జీవరాసులనూ, నవధాన్యాలనూ సృష్టించిన అనంతరం మానవులు సుఖంగా బతకసాగారు. అయితే వారికి సృష్టిలో కొన్ని లోపాలు కనిపించాయి. ఋతువుల మార్పు వల్ల వారికి ఇబ్బందులు కలిగాయి. వారికి ఆహారంగా పనికివచ్చే మొక్కలన్నీ ఏక సాలువి కావటంచేత, వాటిని ఏటా నాట వలసి వచ్చింది. మానవులలో వ్యత్యాసాలు ఏర్పడి కొందరు ధనికులై, దరిద్రులను అణగదొక్కుతున్నారు.

అందుచేత మానవులు బ్రహ్మ వద్దకు రాయబారం పంపదలచి, అందుకుగాను కాకిని ఎన్నుకున్నారు. వారు కాకితో, "ఓ కాకీ, నీవు సృష్టికర్త వద్దకు వెళ్లి ఈ విధంగా వరాలు తీసుకురా: ఇన్ని ఋతువు లుండరాదు, ఎల్లప్పుడూ వసంత ఋతువే ఉండాలి; వరదలూ, వానలూ, వంగుళ్ళూ ఉండరాదు; ఒకసారి నాటిన మొక్కలు ఎల్లప్పుడూ కాయాలి; మానవులలో ధనిక, బీదవ్యత్యాసాలుండరాదు; అందరూ సమంగా ఉండాలి. ఈ విధంగా బ్రహ్మ వల్ల వరం తీసుకురా!" అన్నారు.

ఆప్రకారమే కాకి ఎగిరి బ్రహ్మలోకానికి వెళ్ళి, బ్రహ్మ దర్శనం చేసుకుని, మానవుల కోరికలు ఎరిగించింది. బ్రహ్మ అంతా విని, "ఈ కోరికలు సబబుగానే ఉన్నాయి. మానవులు కోరిన వరాలు నీకిచ్చేస్తున్నాను. నీవు వాటిని తీసుకుపోయి మానవులకే అందించు. మధ్యదారిలో ఎవరికైనా ఇచ్చేసి వాటిని వ్యర్థం చెయ్యకు. అలా చేస్తే అవి మానవులకు దక్కవు!" అన్నాడు.

సంతోషంతోనూ, గర్వంతోనూ పొంగి పోతూ కాకి బ్రహ్మవద్ద సెలవు పుచ్చుకుని భూలోకానికి బయలుదేరింది. "నేను ఎంత గొప్ప పుటక పుట్టకపోతే, ఇంత

జి. ముత్యాలరావు

మహత్తరమైన పని నాపైన పడుతుంది! సృష్టిలో కలిగిన లోపాలను సరిదిద్దే అద్భుతమైన వరాలు నావద్ద ఉన్నాయి!" అనుకుంటూ అది అయాసం తీర్చుకోవ టానికి ఒక రాతిపైన వాలింది.

"ఏం, కాకిబావా? నీ ముఖం చూస్తే ఆనందంతో పొంగిపోతున్నట్టున్నావే? ఏమిటి విశేషం?" అని రాయి కాకిని అడిగింది. కాని కాకి జవాబు చెప్పలేదు.

కాకి జవాబు చెప్పకపోవటం చూసి, "ఏం, కాకిబావా? నేను పేదదాన్ననేగదా నాతో మాట్లాడక బిగదీసుకున్నావు? నాకు ఇల్లా, వాకిలా, తిండా, బట్టా? వానకు తడిసి, ఎండకు ఎండే నాతో నీవెందుకు మాట్లాడతావులే?" అని చెప్పింది రాయి.

ఈ మాటలకు కాకి నొచ్చుకుని, "చూడు, రాయీ! నేను బ్రహ్మవద్ద నుంచి తెస్తున్న వరాలలో ఒకటి నీ కష్టాలన్నిటినీ కడతేర్చు తుంది. భూమిపైన ఇకముందు ఇన్ని ఋతువులుండవు, ఎప్పుడూ ఒకే ఋతు వుంటుంది—వసంత ఋతువు. ఇక నిన్ను ఎండా, వానా, చలీ బాధించబోవు!" అన్నది.

బ్రహ్మ ఇచ్చిన ఆ వరం కాస్తా రాతికి దక్కింది. అందుచేతనే ఆనాటినుంచి ఈనాటివరకూ రాళ్ళు ఋతువుల మార్పుకు చలించవు. అవి చలికి వణకవు. వాటికి



ఊక్క పొయ్యేదు, జలుబు చెయ్యేదు. ఆ తరవాత కాకి రెక్కలు ఆడించి ఎగురుతూ వెళ్ళివెళ్ళి ఒక మొక్కపైన వాలింది.

"ఏం, కాకిబావా? ఏదో గొప్ప పనిమీద వెళుతున్నట్టున్నావే? ఏమిటి విశేషం?" అన్నది మొక్క. కాకి జవాబు చెప్పలేదు.

"స్నేహితుడివిగదా అని పలకరిస్తే, ఎందుకు నాయనా అంత గర్వం? ఏడాది తిరిగేసరికల్లా చచ్చిపోతాననా? స్నేహం ప్రధానం గాని, ఆయువు ప్రధానం కాదు, ఏమనుకున్నావో!" అన్నది మొక్క.

ఈ మాటకు కాకి నొచ్చుకుని, "చూడు, మొక్కా! నేను బ్రహ్మవద్ద నుంచి నీకు పనికివచ్చే వరం ఒకటి తెస్తున్నాను. ఇక ముందు నీకు ఏకసాలు జీవితం ఉండదు. చాలా కాలం బతికి, బతికినన్నాళ్ళూ పూస్తావు, కాస్తావు!" అన్నది.

ఆ వరం కాస్తా ఆ మొక్కకు దక్కింది. అది కాలక్రమాన చెట్టయింది. ఆనాటి నుంచి ఈనాటివరకూ చెట్లు ఒకసారి నాటితే చాలా ఏళ్ళపాటు జీవించి, పూలూ, కాయలూ ఇస్తున్నాయి.

కాకికి ఇప్పుడేం చెయ్యాలో తోచలేదు. బ్రహ్మదేవుడిచ్చిన వరాలలో ముఖ్యమైనవి రెండూ పోయాయి. ఈ సంగతి చెప్పినట్టయితే మానవులు తనను బతకనివ్వరు. అందుచేత మిగిలిన వరం తనకే ఉంచుకుని కాకి మానవులతో, "బ్రహ్మదేవుడు వరాలివ్వలేదు. తాను చేసిన సృష్టి బాగానే ఉన్నదన్నాడు!" అని అబద్ధం చెప్పింది.

ఈ సంగతి తెలియగానే కాకిని బ్రహ్మ క్షుద్రజీవి కమ్మని శపించాడు. అందుచేత కాకులలో ఈనాటికీ వ్యత్యాసం లేకపోయినప్పటికీ అవి క్షుద్రజీవులుగా బతుకుతున్నాయి. వాటిని చూసి మనుషులు అసహ్యపడతారు, వాటిని ఎవరూ పెంచరు, వాటిలో ఒక్క మంచి లక్షణమైనా ఉన్నట్టు ఎవరూ చెప్పుకోరు.



# నవరసాలు



పట్టు వదలని విక్రమార్కుడు తిరిగి చెట్టు వద్దకు వెళ్ళి, చెట్టుపైనుంచి శవాన్ని దించి భుజాన వేసుకుని, ఎప్పటిలాగే మౌనంగా శ్మశానంకేసి నడవసాగాడు. అప్పుడు శవం లోని బేతాళుడు, "రాజా, సమస్త ఐశ్వర్యాల తోనూ తులతూగుతూ రాజభోగాలలో మునిగిపోతూ ఉండే నీవు, మహాఋషులు అవలంబించే కఠోర తపస్సులాటి కార్యాన్ని మీద వేసుకున్నావు. ఇది నిజంగా ప్రశంసించ దగిన విషయం. కళలోకూడా నవరసాలూ ఒప్పించగలవాడే నిజమైన రసికుడు. దీనికి దృష్టాంతంగా రంభుడూ, కుంభుడూ అనే హాస్యగాళ్ళ కథ చెబుతాను విను," అంటూ ఈ విధంగా చెప్పసాగాడు:

వైశాలీ నగరాన్ని పరిపాలించిన చంద్రసేనమహారాజు కొలువులో రంభుడూ, కుంభుడూ అని ఇద్దరు హాస్యగాళ్ళుండే వారు. వారి మాటల చమత్కారం వర్ణనా

## బేతాళ కథలు



తీతం. మామూలు జనంకూడా వారి ముఖాలు కనిపిస్తే చాలు విరగబడి నవ్వే వారు. ఇక రాజసభలో వారు విజృంభించిన నాడు సభికులకు కడుపునొప్పి వచ్చేసేది, రాచకార్యం కొంచమైనా జరిగేది కాదు.

చంద్రసేనమహారాజు కొలువులోకి కర్ణిక అనే నర్తకి కొత్తగా వచ్చింది. ఆమె అందం అద్వితీయం. ఇంద్రుడి కొలువులో ఉండే అప్సరసలుకూడా ఆమెకు పోలరంటే అతిశయోక్తి కాదు. ఆమె పరిచయం అయిన నాటినుంచీ విదూషకులకిద్దరికీ ఆమెను పెళ్ళాడాలని కోరిక కలిగింది. ఒకరి మనసులో ఉన్న ఊహ ఒకరికి తెలిసిపోయింది కూడా. "మన ఇద్దరమూ కర్ణికకు మన కోరిక చెబుదాం. ఆమె మనసులో ఎవరు నచ్చితే ఆమె వారిని పెళ్ళాడుతుంది!" అని వారు నిశ్చయించుకున్నారు.

హాస్యగాళ్ళతో అందరూ చనువుగానే ఉంటారు. అలాగే కర్ణికకూడా రంభ కుంభులతో చాలా చనువుగా ఉండేది. ఆమెకు ఏపాటి విచారం ఉన్నట్టు తోచినా వారిద్దరూ క్షణంలో ఆమెను నవ్వించేవారు. అటువంటి విదూషకులు తనను పెళ్ళాడ తామని అడిగేసరికి కర్ణిక ఎటూ నిర్ణయించలేకపోయింది. హాస్యంలో ఇద్దరూ సమమైన చేతులే. అందచందాలు చూసి ఎవరినో



ఒకరిని ఎన్నుకుందామంటే రంభుడు మరీ సన్నం, కుంభుడు మరీ లావు. అందుచేత ఆమె వారికి ఒక పరీక్ష పెట్టింది.

"హాస్యంలో మీరిద్దరూ అందె వేసిన చేతులే. ఒకరు ఎక్కువ లేదు, ఒకరు తక్కువలేదు. కాని ఇతర రసాలు ఒప్పించటంలో మీ శక్తి ఎలాటిదో ఎవరికీ తెలియదు. కరుణరసంలోగాని, భీభత్స రసంలో గాని మీ సామర్థ్యాలు ప్రత్యక్షంగా చూపినట్టయితే అందులో మీ ఎక్కువ తక్కువలు నిర్ణయించి, ఎక్కువ ప్రజ్ఞగలవాణ్ణి నేను పెళ్ళాడగలను. ఇందుకు మీరిద్దరూ సమ్మతిస్తారా?" అని కర్ణిక అడిగింది.

హాస్యగాళ్ళు సరేనన్నారు గాని, కర్ణిక అన్న మాటలకు ఇద్దరూ నిరుత్సాహం చెందారు. ఎందుచేతనంటే, తమ ముఖాలు చూస్తేనే ప్రజలు విరగబడి నవ్వుతారు. అటువంటప్పుడు రౌద్ర, శృంగార, భీభత్స, భయానక, కరుణ రసాలు ప్రజలలో రేకెత్తేలాగు మాట్లాడటమెలాగు?

ఇది రంభకుంభుల కిద్దరికీ ఒక తీవ్రమైన సమస్య అయిపోయింది. రంభుడు తనకు కర్ణికను పెళ్ళాడే యోగంలేదని నిర్ణయించుకున్నాడు. కుంభుడు మాత్రం కర్ణిక పెట్టిన పరీక్షలో నెగ్గటమెలాగా అని అహోరాత్రాలు ఆలోచించ సాగాడు.





కొద్దిరోజులు గడిచాయి. ఒకనాటి ఉదయం కుంభుడు కోనేటికి వెళ్ళి స్నానం చేసి తిరిగి వస్తూండగా ఒక లావుపాటి మనిషి, పెద్ద మీసాలవాడు ఎదురుపడి, అతి వినయంగా వంగి నమస్కారం చేసి, "దణ్ణం, స్వామీ!" అన్నాడు.

"కుంభుడు ఆగి వాడికేసి పరీక్షగా చూసి, "ఎవర్రా, నువ్వు? నాతో ఏమైనా పనా?" అని అడిగాడు.

"నేను కటికవాణ్ణి, బాబయ్యా! రాజు గారి దగ్గిర పదేళ్ళుగా కొలువున్నాను. మరణ శిక్ష వేసినవారి తలలు కొట్టెయ్యటం నా పని!" అన్నాడు కటికవాడు.

ఆ మాట వినగానే కుంభుడికి పళ్ళు కంపరమెత్తింది. "అయితే నాతో ఏం పనీ?" అన్నాడతను.

"నేను కొలువు మానుకున్నాను, బాబయ్యా! బౌద్ధమతం పుచ్చుకుంటాను. చేసిన పాపం చాలు. తిండి గడవక ఎన్నో పాపాలు చేస్తాం, బాబయ్యా! ఎన్నో కష్టాలు పడి ఈ కటికపనిలో ప్రవేశించాను. నేను చేసిన పాపాలన్నీ ప్రజలకు చెప్పుకుంటే నాకు మతం ఇప్పిస్తారు. బాబయ్యా, ఇవాళ రాత్రి రచ్చబండదగ్గిర నేను నా ఊసంతా వెళ్ళబోసుకోవాలి!" అన్నాడు కటికవాడు.

"అలాగే చెయ్యి! వచ్చి నీ ఉపన్యాసం వినమంటావా?" అన్నాడు కుంభుడు.

కటికవాడు మరింత వంగి నమస్కారం చేసి, "బాబయ్యా, ఎంత మాట సెల విచ్చారు. నాలాటివాడు మాట్లాడటమేమిటి, తమలాటివాళ్ళు వినటమేమిటి? చదువు సంధ్యలు లేనివాణ్ణి. నాకు ఏం చెప్పాలో కూడా తెలీదే! మీలాటి చదువుకున్నవాళ్ళు సహాయం చెయ్యాలి, బాబయ్యా. తమరు నామీద దయ ఉంచి, నాకు ఎట్లా మాట్లాడాలో నేర్పాలి. అసలు నలుగురెదట నిలబడి మాట్లాడటమంటేనే నాకు కాళ్ళు వణుకుతున్నాయి!" అన్నాడు.



తక్కున కుంభుడి బుర్రలో ఒక ఆలో చన తట్టింది. ఆ రాత్రి తానే కటికవాడల్లే బుగ్గమీసాలూ అవీ తగిలించుకుని రచ్చ బండ దగ్గిర మాట్లాడటానికి అతను నిర్ణ యించుకున్నాడు.

"ఒరే, నీ పేరేమిటి? ఊళ్ళో నిన్ను బాగా ఎరిగిన వాళ్ళు చాలామంది ఉన్నారా?" అని అడిగాడు కుంభుడు.

"నా పేరు కంటకుడు, బాబయ్యా! తలలు నరికేవాణ్ణి ఎరిగున్నవాళ్ళుండరు, బాబయ్యా! నాది అంధకారపు బతుకు!" అన్నాడు కటికవాడు.

"అయితే నీ జీవిత కథ యావత్తూ చెప్పుకురా!" అన్నాడు కుంభుడు. కటిక వాడు ఓపికగా తన కథ యావత్తూ విదూష కుడికి చెప్పాడు.

అంతా విని కుంభుడు, "సరే ఈ రాత్రికి నువు ఇంటోనే ఉండిపో. నీ బదులు నేను మాట్లాడతాను. నిజం ఎవరికీ తెలియకుండా చూసే భారం నాది!" అని కటికవాడితో చెప్పి నేరుగా కర్ణిక బసకు వెళ్ళాడు. అ సమయానికి రంభుడు కర్ణికతో మాట్లా డుతూ అక్కడే ఉన్నాడు.

"ఇవాళ రాత్రికి రచ్చబండకు మీరిద్దరూ రండి. అక్కడ ప్రజలకు నవరసాలూ



రుచి చూపిస్తాను!" అని కుంభుడు వారిద్దరికీ చెప్పి, కటికవాడి వృత్తాంతం వివరించాడు.

ఆ సాయంకాలం చాటింపు వేశారు; కంటకుడనే తలారివాడు బౌద్ధమతం పుచ్చుకోబోతున్నాడు గనక ఆ రాత్రి రచ్చ బండవద్ద సమస్తమైన జనుల ఎదటా తాను గడిపిన పాపపు బతుకు గురించి చెప్పుకుంటాడని ప్రజలకు హెచ్చరిక జరిగింది.

జాముురాత్రి గడవగానే రచ్చబండదగ్గిర దాదాపు రెండువేలమంది జనం పోగయారు. వారిలో కర్ణికా, రంభుడూ ఉన్నారు. కుంభుడు తన శరీరమంతా తేలికగా నల్ల

రంగు పూసుకుని, బుగ్గమీసాలు పెట్టుకుని, తలకు ఒక రంగుగుడ్డ చుట్టుకుని, మెడ లోనూ, దండెలకూ తాయెత్తులు కట్టుకుని, కటికవాడి యాసలో మాట్లాడసాగాడు.

అతను మొదటగా కంటకుడి చిన్నతనపు దారిద్ర్యం గురించి కాస్సేపు హాస్య ధోరణిలో మాట్లాడాడు. తరవాత తన భార్యా, బిడ్డలూ ఆకలికి మాడిన ఘట్టాలు విని జనానికి జాలి కలిగేటట్టు చేశాడు. తరవాత తాను తల కొట్టిన నిందితులనుగురించి వర్ణనలు ప్రారంభించి ప్రజలలో, రౌద్ర, భీభత్స, భయానక రసాలు కలిగించాడు. అంతా అయాక తాను ఈ పాపిష్టి జీవితం మాని బుద్ధభగవానుడి చరణాలు ఆశ్రయించబోతున్నట్టు చెప్పి శాంతరసంకూడా ఒప్పించాడు.

కుంభుడు తిరిగి వచ్చినాక కర్ణికా, రంభుడూ అతని నటనను మెచ్చుకున్నారు.

"మాట్లాడటం పూర్తి చేసి నువు అవతలికి వెళ్ళగానే మా పక్కన కూచున్న ముసలివాడు ఒకాయన, 'ఈ కంటకుడు ఉండేది ఎక్కడో? నేను వాడితో మాట్లాడాలి!' అన్నాడు. ఆయన ఇల్లు దుర్గాలయం వెనకనే ఉందట. పేరు శక్తిసింహుడుట. వెళతావా ఏమిటి? ఈ శక్తిసింహుడు చాలా ధనికుడులాగా ఉన్నాడు, నీకేమైనా సన్మానం చేస్తాడేమో!" అన్నాడు రంభుడు.



"ఈ వేషం మళ్లీ ఇంకొకసారి వెయ్యాలా? అలాగే చేస్తాను! నాకేమీ అభ్యంతరం లేదు!" అన్నాడు కుంభుడు.

మర్నాడు ఉదయం అతను ఆ కంట కుడి వేషంతోనే దుర్గాలయం వెనక ఉండే ఇంట్లో బస చేస్తున్న శక్తిసింహుణ్ణి వెతుకుతూ వెళ్ళాడు. శక్తిసింహుడు సులువుగానే దొరి కాడు గాని ఆయన ధనికుడు కాదని తేలి పోయింది. మనిషి చాలా ముసలివాడు, ముఖం ముడతలు పడి ఉన్నది. చావ టానికి సిద్ధంగా ఉన్నట్టున్నాడు.

"లోపలికి రారా, కటికవాడా! భయ పడకు. నిన్న రాత్రి నీ కథ విని చాలా జాలిపడ్డాను. నీకు బహుమానంగా ఇవ్వ టానికేమీ లేదు. ఇదిగో ద్రాక్షరసం, కాస్త తాగు!" అంటూ శక్తిసింహుడు చాలా ఆప్యాయంగా మాట్లాడాడు.

కుంభుడు సంకోచించకుండా ముసిలివా డిచ్చిన ద్రాక్షరసం గడగడా తాగేశాడు.

"నువు తల కొట్టినవారిలోకల్లా ధీరుడు రణసింహుడు ఒక్కడేనన్నావు కాదూ? వాడు నా కొడుకు—ఒక్కడే కొడుకు! వాడు నిరపరాధి అయి ఉండికూడా నీ గండ్రగొడ్డలికి బలి అయాడు. ఇన్నాళ్ళూ వాడి చావుకు ప్రతిక్రియ చెయ్యలేక పోయాను. పగ తీర్చుకోకుండానే పోతానా





అని భయపడుతూండగా, వాడి తల తీసిన నీవు నాకు దొరికావు!....ద్రాక్షరసం ఇంకా మిగిలి ఉన్నదా? లేక అంతా తాగేశావా?" అన్నాడు ముసలివాడు ఉద్రేకంతో.

కుంభుడికి అంతా అర్థమయింది. తాను తాగినది విషం కలిపిన ద్రాక్షరసం! ఒక్క చుక్క మిగలకుండా అంతా తన పొట్టలోకి పోయింది. కుంభుడికి ముచ్చెమటలు పోశాయి. అతను వాంతి చేసుకోవటానికి ప్రయత్నించాడు.

"వెర్రివాడా! ఎక్కడికి తప్పించుకు పోతావు. ఇంకొక్క గంటలో నీ బతుకు తేలిపోతుంది!" అన్నాడు వృద్ధుడు.

"నా తప్పేమీ లేదు. మీ అబ్బాయికి మరణదండన విధించినది రాజు. నేను రాజాజ్ఞ పాలించాను. నాకెందుకు విషం ఇచ్చారు?" అని కుంభుడు అరవసాగాడు.

"ఇంతేనా నీ నటన?" అంటూ శక్తిసింహుడు తన ముఖానికీ, తలకూ తగిలించిన తొడుగులు విప్పేశాడు. రంభుడే శక్తిసింహుడని గ్రహించి కుంభుడు వెలవెల పోయాడు.

బేతాళుడీ కథ చెప్పి, "రాజా, రంభ కుంభులలో ఎవరు ఎక్కువ? కర్ణిక ఎవరిని పెళ్ళాడాలి? ఈ సమస్యకు సమాధానం తెలిసికూడా చెప్పకపోయావో నీ తల పగిలి పోతుంది," అన్నాడు.

"కుంభుడు జనసామాన్యం ఎదట నవరసాలూ ఒప్పించినవాడు. అతనిది నిజమైన నటన. రంభుడిది కేవలం వంచన మాత్రమే. అతను కుంభుడిలో భయం రెచ్చగొట్టాడేగాని భయానకరసం ఉత్పాదన చెయ్యలేదు. అందుచేత కుంభుడే కర్ణికను పెళ్ళాడటానికి అర్హుడు!" అని విక్రమార్కుడు చెప్పాడు.

రాజుకు ఈ విధంగా మౌనభంగం కలగగానే బేతాళుడు శవంతోసహా మాయమై మళ్లీ చెట్టెక్కాడు. —(కల్పితం)



# ముసలి గుర్రం

ఒక లంబాడీవాడి దగ్గిర ఒక గుర్రం ఉండేది. అది చాలా ముసలిదయి పోయింది. సవారీకి ఏమాత్రమూ పనికి రాదు. అందుచేత దాన్ని ఏ కాడికైనా అమ్ముదామనుకున్నాడు లంబాడీ.

గుర్రం అమ్మకానికున్నదని తెలిసి ఒక కాపుమనిషి లంబాడీ ఉండే చోటికి వచ్చాడు. లంబాడీకీ కాపుమనిషికీ బేరంమాటలు జరుగుతూండగా లంబాడీ భార్య వచ్చింది.

"మా గుర్రం మాటేనా అడుగుతున్నావు? ఆ పాపిష్టి గుర్రాన్ని ఎవరు కొంటారు, బాబూ?" అన్నది లంబాడీ స్త్రీ.

"అదేమిటమ్మా? మీ గుర్రాన్ని నువే తీసేస్తున్నావు?" అన్నాడు కాపు.

"తీసెయ్యనూ? మొన్న ఏం జరిగిందో తెలుసా? ఈ చుట్టుపక్కల ఒక కుందేలున్నది. దాన్ని ఎట్లాగైనా పట్టి మేమూ పిల్లలూ తిందామనుకుంటుంటే, మా దిక్కుమాలిన గుర్రం దాన్ని చూసి తరిమి పట్టుకుని, అంతా తినేసింది, మాకూ మా పిల్లలకూ కొంచెమైనా మిగల్చకుండా!" అన్నది లంబాడీది.

కాపు నిర్ఘాంతపోయి, "అంత వేగంగా పరుగెత్తుతుందా?" అనుకుని, అటే బేరంచెయ్యక, లంబాడీవాడికి డబ్బిచ్చి గుర్రాన్ని కొనుక్కుపోయాడు.





# పికిలి పిట్ట

గండభేరుండపక్షి పక్షు లన్నిటికీ రాణి. దానికున్న బలమూ, వేగమూ ఇతర పక్షులకు లేవు. అందుచేత ఇతర పక్షులు తమ కేదైనా ఆపద కలిగినా, అన్యాయం జరిగినా గండభేరుండపక్షితో మొరపెట్టుకునేవి. గండభేరుండపక్షి వాటికి తగిన విధంగా సహాయం చేస్తూ ఉండేది.

ఒక పికిలిపిట్ట ఒక పొలంలో మూడు గుడ్లు పెట్టింది. సమీపంలోని కలుగులో ఉండే ఒక చిట్టెలుక వచ్చి అందులో రెండు గుడ్లను కాజేసింది. అసహాయురాలైన పికిలిపిట్ట తమ రాణి అయిన గండభేరుండపక్షి వద్దకు వెళ్ళి, "దొరసానీ, నన్ను ఆపదనుంచి రక్షించు. నేను మూడు గుడ్లు పెడితే, అందులో రెంటిని చిట్టెలుక వచ్చి తినేసింది. అది నా మూడో గుడ్డునుకూడా కాజేసి నాకు గర్భశోకం కలిగిస్తుంది. ఆ ఆపద నుంచి కాపాడాలి!" అని మొరపెట్టుకున్నది.

గండభేరుండపక్షి కింద అనేక ఘనమైన పక్షులున్నాయి. వాటిలో అందానికీ, బలానికీ, పాటకూ, మాటకూ, ఆటకూ ప్రసిద్ధి చెందినవి ఉన్నాయి. ఉష్ట్రపక్షులూ, రాబందులూ, డేగలూ, నెమళ్లూ, చిలకలూ, గోరింకలూ మొదలైనవాటితో పోలిస్తే ఈ పికిలిపిట్ట ఎంత? అందుచేత గండభేరుండపక్షి చిరాకుపడి, "ప్రతి చిన్నదానికీ నాదగ్గిరికి వస్తే నేనేం చెయ్యగలను? నీ ముష్టిగుడ్లను కాపాడటంకూడా నాపనే అయితే రాజ్యం చెయ్యటం నాచేత నవుతుందా? కాకపోయినా పిల్లలను కాపాడుకునే నేర్పు ప్రతి తల్లికీ ఉండాలి. ఆ పాటినేర్పు నీలోలేక పోవటం ఆశ్చర్యంగావుంది. నన్ను వేధించక నీ గుడ్లను నువే కాపాడుకో!" అన్నది.

"దొరసానీ, గోరుతో పొయ్యేదానికి గొడ్డలి కావలిసి వస్తుందన్న సామెత వినలేదా? నేను చిన్న పక్షిననీ, అనామకురాలిననీ

సి. వెంకటరాజు

భావించి నన్ను నిర్లక్ష్యం చెయ్యటం తగదు," అన్నది పికిలిపిట్ట.

"నువు నాకు నీతులు చెప్పవచ్చావా? పద, పద!" అన్నది గండభేరుండపక్షి.

పికిలిపిట్ట పుట్టెడు విచారంతో తన గుడ్డున్నచోటికి తిరిగివచ్చి, ముక్కున ఒక దర్భపుల్ల పట్టుకుని తన గుడ్డును కాపాడటానికి కూచున్నది. ఇంతలో చిట్టెలుక రానేవచ్చింది. తన మిగిలిన గుడ్డుకాస్తా పోతుందన్న అదుర్దాలో పికిలిపిట్ట దర్భపుల్లతో చిట్టెలుకను పొడిచింది. ఆ పుల్ల సూటిగా చిట్టెలుక కంట్లో పొడుచుకున్నది. చిట్టెలుక బాధ భరించలేక శరవేగంతో పరిగెత్తిపోతూ, కళ్లు కనపడక, ఒక నిద్రపోయే సింహం ముక్కులో దూరింది. సింహం ఉలిక్కిపడి నిద్ర లేచి, తన కేదో పెద్ద అపాయం జరగబోతున్నదనుకుని పరిగెత్తిపోయి ఒక సరస్సులోకి దూకింది.

ఆ సమయానికి నాగరాజైన వాసుకి ఆ సరస్సులో ఈదుతున్నాడు. అకస్మికంగా సింహం సరస్సులోకి ప్రవేశించేసరికి వాసుకి బెదిరి ఆకాశంలోకి ఎగిరిపోసాగాడు. అలా పోతూ వాసుకి, మేరుపర్వత శిఖరాన ఉన్న గండభేరుండపక్షి గూటిని ప్రమాదవశాన తోశాడు. అందులో ఉన్న గుడ్డు కాస్తా కింద పడి చితికిపోయింది.





తన గుడ్డు చితికిపోయినందుకు ఏడుస్తూ గండభేరుండపక్షి వాసుకితో, "ఇదేం పని, వాసుకీ? నేను నీకేమి అపచారం చేశాను. నా గుడ్డునెందుకు నాశనం చేశావు? ఎన్నో ఏళ్లకుగాని ఒక గుడ్డును పెట్టనుగదా? నా కెంత నష్టం కలిగించావో చూడు!" అన్నది.

వాసుకి నొచ్చుకుంటూ, "నేను బుద్ధి పూర్వకంగా ఏమీ చెయ్యలేదు. నేను సరస్సులో ఈదుతూండగా ఒక భయంకర మైన సింహం బొబ్బలుపెడుతూ నాకేసి వచ్చింది. నేను కంగారుపడి గాలిలోకి ఎగిరాను. నీ గూడుకూడా నేను గమనించ లేదు," అన్నాడు.

ఇద్దరూ కలిసి సింహం వద్దకు వెళ్లి, "నువ్వలా గర్జించుతూ సరస్సులోకి ఎందుకు ప్రవేశించావు? అందువల్ల ఎంత నష్టం జరిగిందో తెలుసా?" అన్నారు.

"క్షమించాలి! నేనేం చేస్తున్నానో నాకే తెలియదు. నేను నాదారిన రెల్లు మధ్య పడుకుని నిద్రపోతూండగా నా ముక్కులో ఒక చిట్టెలుక దూరింది. ఏం జరిగినదీ తెలియక, నా ప్రాణానికి ప్రమాదం వచ్చిందనుకుని పరిగెత్తాను. ఆ తొందరలో నేను సరస్సునూ చూడలేదు, వాసుకినీ చూడ లేదు," అన్నది సింహం.

చిట్టెలుకను అడిగితే అది, "నా తప్పేమీ లేదు. నేను పికిలిపిట్ట గుడ్డును తినబోతే ఆ పిట్ట నా కంటిని దర్భతో పొడిచింది. నేను ఒకవంక కన్నుపోయి దిక్కు తెలియక పరిగెత్తుతూ సింహం ముక్కులో దూరాను కాబోలు. తెలిసిఉండి నాకై నేను సింహం ముక్కులో ఎందుకు దూరుతానూ?" అన్నది.

గండభేరుండపక్షికి అంతా అర్థమయింది. తప్పంతా తనదే. పికిలిపిట్ట తనతో వచ్చి మొరపెట్టుకున్నప్పుడది తనకు చాలా స్వల్ప విషయంగా తోచింది. స్వల్పవిషయాలను అలక్ష్యం చేస్తే పెద్ద ప్రమాదాలకు దారి తీస్తాయని గండభేరుండపక్షి తెలుసుకున్నది.





# భయంకర మానవుడు

ఒక నిర్జనమైన అరణ్యంలో అన్ని రకాల మృగాలూ, పక్షులూ—సింహం పరిపాలనలో సుఖంగా జీవిస్తూండేవి. అందులోకి ఎన్నడూ మనుష్యులు అడుగు పెట్టలేదు. ఆ అరణ్యంలో ఒకనాడు ఒక బాతు నిద్ర పోతూండగా ఒక కల వచ్చింది. ఆ కలలో బాతుకు మానవుడు కనిపించి దాన్ని లాలించి దగ్గిరికి పిలిచాడు. బాతు మానవుడి దగ్గిరికి పోబోతూండగా ఎవరో దాని చెవిలో పెద్దగా అరిచినట్టయింది. "ఆ మృగం జోలికి వెళ్లకు. అన్ని మృగాలకన్నా అది క్రూరమైనది!" అనే మాటలు విని బాతు తుళ్ళిపడి నిద్ర లేచి ఆ కంగారులో దిక్కు తెలియకుండా అరణ్యంలో పడి పరిగెత్తసాగింది.

పోగాపోగా బాతుకు సింహం ఉండే గుహా, దానిముందు నిలబడివున్న యువరాజూ కనిపించాయి. ఈ యువరాజును తల్లిదండ్రులు గుహ దాటి వెళ్ళనిచ్చేవారు కారు; అందుచేత దానికి ప్రపంచజ్ఞానం లేదు. అడవిలో ఉండే ఇతర జంతువులే తెలియవు.

ఒక పక్షి కంగారుగా పరిగెత్తుకు వస్తూండటం చూసి యువరాజు, "ఓ పక్షీ, నీవు ఎవరు? ఏ జాతిదానివి? ఎందుకలా గాభరాగా పరిగెత్తుతున్నావు?" అని అడిగింది.

"మహారాజా, నేను బాతును, బాతుల జాతికి చెందినదాన్ని. నేను కలలో మానవుణ్ణి చూసి, అది మహా భయంకరమైన మృగమనే మాటలు విని భయపడి పారిపోతున్నాను," అన్నది బాతు.

"వెర్రిదానా, నేను మృగరాజును ఉండగా నీకే మృగం భయమూ లేదు. ఆ మానవుణ్ణి చీల్చి చెండాడేస్తాను. వెనక నాకుకూడా ఇలాగే కలలో మానవుణ్ణి గురించి హెచ్చరిక జరిగింది. కాని నాకే ప్రమాదమూ జరగలేదు," అంటూ సింహం

వై. సోమసుందరం



యువరాజు, బాతు వచ్చినవేపే వేగంగా నడవసాగింది. బాతు గెంతుకుంటూ సింహాన్ని అనుసరించింది.

వారు కొంతదూరం వెళ్ళేసరికి దూరాన దుమ్ము లేచింది. "అదుగో మానవుడు వస్తున్నట్టుంది. నువు దాక్కో. నేను వాడి అంతు తేలుస్తాను," అన్నది సింహం.

కాని తీరా దగ్గిరికి వచ్చేసరికి అది ఒక గాడిద. "ఎవరు నీవు? నీది ఏ జాతి? ఎందుకిలా గాభరా పడి పరిగెత్తుతున్నావు?" అని సింహం గాడిదను అడిగింది.

"మహారాజా, నేను గాడిదను. మాది గాడిదల జాతి. మానవుడు నన్ను ఏమి హింస పెట్టాడో మీరు ఊహించలేరు. ఎన్ని బరువులు మోశాను! ఎన్ని దెబ్బలు తిన్నాను! నా శక్తి ఉడిగినకొద్దీ దెబ్బలు హెచ్చాయి, తిండి తగ్గింది. ఇక వాడు నన్ను చంపేస్తాడు!" అన్నది గాడిద.

"మృగరాజును నేనుండగా నిన్ను ఎవరూ చంపలేరు. అగి నేను మానవుణ్ణి ఎలా చంపుతానో చూడు!" అన్నది సింహం.

"క్షమించండి, మహారాజా. ఆ మానవుడి కంట పడే ధైర్యం నాకు లేదు," అంటూ గాడిద ముందుకు సాగిపోయింది.

మళ్ళీ దూరాన దుమ్ము లేచింది. కాని ఈసారి ఒక గుర్రం నురుగులు కక్కుతూ, ఎగరొప్పుతూ వచ్చింది. సింహం యువరాజు దాన్ని ఆపి పేరూ, జాతీ, పారిపోతున్న కారణమూ అడిగింది.

"మహారాజా, మానవుడికి వెరిచి పారిపోతున్నాను," అన్నది గుర్రం.

"ఇంత పెద్ద జంతువువు, ఇంత బలం గల దానివి, మానవుడికి భయపడుతున్నావా? నీకన్న మానవుడికి బలం హెచ్చా?" అని అడిగింది సింహం.

"లేకపోతేనేం, మహారాజా? వాడు క్రూరుడు, ఉపాయశాలి. నాచేత ఇన్నాళ్లూ వెట్టిచాకిరీ చేయించుకున్నాడు. నా వీపున

ఎక్కి కూచుని, నాకు కళ్ళెం తగిలించి, నన్ను కొరడాతో కొట్టి, రికాబు ములుకులతో డొక్కలో పొడిచి వేలాది మైళ్ళు సవారీ చేసి, ముసలిదాన్నయానని నన్ను చంపించి నా చర్మం కాజేయజూస్తున్నాడు!" అన్నది గుర్రం. సింహం ఎంత ధైర్యం చెప్పినా వినక గుర్రం సాగిపోయింది.

తరవాత ఒంటె పరిగెత్తుకుంటూ వచ్చింది. అదికూడా మానవుడికి వెరిచే పారిపోతున్నది.

"మిమ్మల్ని అందర్నీ రక్షించే భారం నాది! అందుచేత పారిపోకు. ఇక్కడే ఉండు. నీ వెనకగా వస్తున్న మానవుణ్ణి ఏం చేస్తానో చూడు!" అన్నది సింహం. కాని ఒంటె క్షమాపణ చెప్పుకుని మానవుడి కంట పడకుండా ముందుకు సాగిపోయింది. మానవుణ్ణి చూసి పరిగెత్తే ఈ జంతువులకు తనలో అపాటి విశ్వాసం లేకపోవటం చూసి సింహం ఆశ్చర్యపడింది.

మరి కాస్సేపట్లో ఒక ముసలి మనిషి అటుగా వచ్చాడు. వాడి నెత్తిన ఒక తట్టా, తట్టలో వడ్రంగపు పనిముట్లూ, తట్టమీద కొన్ని కొయ్యపలకలూ ఉన్నాయి. వాడు సింహాన్ని చూసి తట్ట దించి సాష్టాంగ పడి, "జయం, జయం, మహారాజా! వెయ్యేళ్లు చల్లగా బతకాలి!" అన్నాడు.



శరీరమంతా ముడతలుపడిన ఆ జంతువును చూసి సింహం విరగబడి నవ్వి, "నీవు ఎవరు? నీది ఏజాతి? నీవుకూడా మాన వుడికి భయపడే వచ్చేస్తున్నావా?" అని అడిగింది. బాతు వడ్రంగిని చూస్తూనే మూర్ఛపోవటంవల్ల, వాడే మానవుడని సింహా నికి చెప్పలేకపోయింది.

"మహారాజా, నేను వడ్రంగిని, వడ్రం గుల జాతివాణ్ణి! ఏలినవారివద్ద మంత్రిగా ఉండే చిరతపులి ఇల్లు కట్టిపెట్టమని కబురు పంపితే కట్టటానికి వెళుతున్నాను!" అన్నాడు వడ్రంగి.

"ముందు మాకు కట్టకుండా చిరతపులికి ఇల్లు ఎలా కడతావు? మా ఇల్లు కట్టి మరీ కదులు!" అన్నది సింహం.

"ముందు చిరతపులికి ఇల్లు కట్ట నివ్వండి, తరవాత తమకు పెద్ద భవంతి కడతాను!" అన్నాడు వడ్రంగి తట్ట నెత్తిన ఎత్తుకుని పోబోతూ.

"వడ్రంగి జాతి జంతువా? నేనెవరో తెలుసా?" అంటూ సింహం తన ముందు కాలి పంజా ఎత్తి విలాసంగా వడ్రంగి రొమ్ముమీద చిన్న తోపు తోసింది. వడ్రంగి ఆ చిన్న తోపుకే వెల్లికిలా పడ్డాడు. వాడి నెత్తిన ఉన్న తట్ట కిందపడి పనిముట్లు చప్పుడు చేశాయి.

"చిత్తం, మీరు కోరినట్టే చేస్తాను," అంటూ వడ్రంగి ఒక బోను చేసి అందులో సింహం దూరే కంత అమర్చాడు, "లోపలికి వెళ్ళి చూడండి!" అన్నాడు. సింహం లోపలికి వెళ్ళగానే వడ్రంగి బోను వాకిలి చప్పున మూసేసి, సింహాన్ని తమ నగరానికి పట్టుకుపోయేందుకు బయలుదేరాడు.

"ఏయ్, వడ్రంగీ? ఏమిటీ పని?" అని సింహం లోపలినుంచి అరిచింది.

"నేనే మానవుణ్ణి! నన్ను చూసి నువు పారిపోవలిసింది!" అంటూ వడ్రంగి పొట్ట చెక్కలయేలా నవ్వాడు.






## 18

[రూపధరుడి పని ముగిసింది. తన భార్యను పెళ్లాడే ఉద్దేశంతో ఇంట చేరి తన సొత్తంతా తినేస్తున్న గ్రీకు రాజకుమారులందరినీ అతనూ, అతని కొడుకూ కలిసి అటకాయించి మారణహోమం చేసేశారు. ఇందుకుగాను రూపధరుడు కేవలం తన పరాక్రమంపైనే ఆధారపడలేదు, తన యుక్తిపైనకూడా ఆధారపడ్డాడు. దేవతలుకూడా అనాడు అతనిపక్షాన ఉన్నారు. కాని అప్పటికీ రూపధరుడి సమస్యలు సాంతం తీరిపోలేదు.]

ఇదంతా జరుగుతున్నంతసేపూ పద్మముఖి నిద్రపోతున్నది. బహుకీర్తి అమె శయ్యామందిరానికి వెళ్లి, "లే, లే! ఇంకేం నిద్రపోతావు? నీ భర్త వచ్చాడు. దుష్టసంహారం పూర్తి అయింది. నీకు మంచి రోజులు వచ్చాయి!" అని అమెను హడావిడిగా నిద్రలేపింది.

మొదట పద్మముఖి తన చెవులను నమ్మలేకపోయింది. అమె అనుమానంతో లేచి, "విధిచర్యలు చాలా ఆశ్చర్యకరంగా ఉంటాయిగద. అయినా, ఆ దుర్మార్గులను కడతేర్చిన మనిషిని చూస్తాం పద!" అన్నది. అమె ముసలిదాన్ని వెంట బెట్టుకుని కిందికి దిగివచ్చి రూపధరుడికి ఎదురుగా ఉన్న కుర్చీలో కూర్చున్నది. అమె ముఖాన ఏ భావమూ లేదు. అమె తనను పలకరిస్తుందనుకున్న రూపధరుడు అమె మౌనం చూసి ఆశ్చర్యపోయాడు.



"అమ్మా, నువు మనిషివా, రాయివా? నాన్నను పలకరించక, బెల్లం కొట్టిన రాయి లాగా ఉండిపోయావేం?" అన్నాడు ధీరమతి తల్లితో.

"ఏం మాట్లాడమన్నావు, నాయనా? నా గుండె మొద్దుబారిపోయి ఉన్నది. ఆయన నిజంగా మీ నాన్నే అయితే నే నాయనను తెలుసుకోలేకపోను. ఈ ఇంట్లో మా యిద్దరికి మాత్రమే తెలిసిన రహస్య విషయాలు చాలా ఉన్నాయి," అన్నది పద్మముఖి.

రూపధరుడు కొడుకుతో, "మీ అమ్మను వేధించకు. ఆవిడ నన్ను పరీక్ష చెయ్యనియ్యి. నేనెవరో ఆమె సులువుగానే తెలుసుకుంటుందిలే. ఈ కుళ్ళుగుడ్డలు చూసి నేను మరెవరో అనుకుంటున్నది. మనం కర్తవ్యం ఆలోచించాలి. నువు ఒక్క మనిషిని చంపితేనే అతని బంధు మిత్రులకు వెరిచి దేశం వదిలి పారిపోవాలి. మనం ఈ రోజున ఇథకాలో ఉండే ప్రముఖ యువకుల నందరినీ దారుణంగా చంపేశాం. ఆ మాట జ్ఞాపకం ఉంచుకో!" అన్నాడు.

"అయితే ఏం చెయ్యాలో నువే ఆలోచించు. ఆలోచనకు నిన్ను మించిన వాడెవడున్నాడూ?" అన్నాడు ధీరమతి.

"సరే, నా ఆలోచన విను. మొదట అందరూ స్నానాలు చేసి మంచి బట్టలు

వేసుకోవాలి. తరవాత నృత్యగీతాలు వాయించాలి; అవి విని లోపల పెళ్లి జరుగుతున్నదని బయటివాళ్లు అనుకోవాలి. వీళ్లంతా చచ్చిన మాట పైకి ఏమాత్రమూ పొక్కరాదు. ఈలోపల మనం ఊరు దాటి పల్లెలలోకీ, అరణ్యాలలోకీ వెళ్లిపోదాం," అన్నాడు రూపధరుడు.

రూపధరుడు చెప్పిన ప్రకారమే అందరూ స్నానాలు చేసి మంచి బట్టలూ, నగలూ ధరించి వాద్యాలతో సహా నృత్యాలు చేయసాగారు. బయట వీధిలో నడిచే జనం, "ఓహో, ఇంతకాలానికి ఈ ఇంటావిడకు మనువు కుదిరినట్టుందే. వెళ్లిపోయిన మొగుడికోసం వేచి ఉండలేకపోయింది కాబోలు!" అనుకున్నారు.

రూపధరుడు స్నానం చేసి శరీరమంతా తైలం మర్దించుకున్నాక మరొక మనిషిలాగా అయిపోయాడు. అతను భార్యతో, "ఏం మనిషివి? ఇరవై ఏళ్ల తరవాత ఇంటికి వచ్చిన భర్తను మరొకతె అయితే ఎంత ఆప్యాయంగా ఆదరించును!" అని, ముసలి దాదితో, "నానమ్మా, నాకు పక్క వెయ్యి, పడుకుంటాను!" అన్నాడు.

వెంటనే పద్మముఖి దాదితో, "నానమ్మా, ఆయన మంచం ఇవతలికి తెచ్చి, దానిపైన తోళ్లూ, కంబళ్లూ పరుచు!" అన్నది.





రూపధరుడికి ఈమాట వినగానే కోపం రెచ్చిపోయింది. "నా మంచాన్ని ఎవరు కదిలించారు? అది కదిలే మంచం కాదే!' అన్నాడు అతడు.

ఈ మంచంలో ఒక కిటుకున్నది. రూపధరుడు ఆ ఇల్లు కట్టినప్పుడు, అతని పడక గదిలో ఒక చెట్టుండేది. ఆ చెట్టును కొట్టినప్పుడు అతను దాని బోదెను భూమిలోనే ఉంచి, ఒక కోడులాగా తయారుచేసి మిగిలిన కోళ్ళూ, పట్టెలూ దానికి అమర్చి మంచం తయారుచేశాడు. ఈ రహస్యం అతనికి తెలుసునో లేదో బయటపెట్టించటానికే పద్మముఖి ఆ మాట అన్నది. రూపధరుడన్న మాటతో ఆమె సందేహం నివారణ అయింది. ఆమె తన భర్తను కౌగిలించుకుని, "నాపైన ఆగ్రహించకండి. ఎవరు నన్ను మోసగించుతారో అని నేను భయపడి చస్తున్నాను," అన్నది.

తన భార్య తీసుకున్న జాగ్రత్తకు రూపధరుడు చాలా సంతోషించాడు. ఆ రాత్రి పద్మముఖి తన భర్తనోట అతనికి కలిగిన అనుభవాలన్నీ విన్నది. తెల్లవారే సమయంలో రూపధరుడు తన వంటికి కవచం వేసుకుని ధీరమతిని నిద్ర లేపి అతనితోసహా బయలుదేరాడు. ఎవరూ చూడకుండానే వారు నగరం దాటారు.

వారిద్దరూ రూపధరుడి తండ్రి అయిన పిపీలకుడు ఉండే చోటు చేరారు. ఒకప్పుడు రాజరికం నిర్వహించిన పిపీలకుడు అక్కడ ఇల్లు వేసుకుని, చెట్లూ చేమలూ పెంచుతూ, దారిద్ర్యంలో నివసిస్తున్నాడు. రూపధరుడు తన తండ్రి నౌకర్లతో విందు భోజనం తయారుచెయ్యమని చెప్పి తోటలోకి వెళ్ళాడు.

అక్కడ ముసలి పిపీలకుడు ఒక మొక్కచుట్టూ పాదు తవ్వి బాగుచేస్తూ కనిపించాడు. అయన ధరించివున్న చొక్కా నిండా మాసికలే.



ఆయనను చూడగానే రూపధరుడి కంట నీరు తిరిగింది. వెంటనే వెళ్లి ఆయనను కౌగలించుకుని తన సంగతులన్నీ చెప్పేద్దామనుకున్నాడుగాని ఆయన తనను గుర్తిస్తాడో గుర్తించడో చూడాలన్న కోరిక కలిగింది. అందుచేత అతను తండ్రిని సమీపించి, "ఏం, తాతా? నీ తోటలో మొక్కలన్నిటికీ ఇంత బాగా పోషణ చేస్తున్నావుగాని, నీకేమీ పోషణ జరుగుతున్నట్టు లేదే? నీ యజమానికి నువు చేసే చాకిరి తృప్తికరంగా లేదాఏం?" అన్నాడు.

"ఎవరు, నాయనా, నువూ? మీది ఏ దేశం?" అని పిపీలకుడు అడిగాడు.

"మాది సంచారదేశంలే, తాతా. అయిదేళ్ల కిందట రూపధరుడనేవాడు నాకు తగిలాడు. ఇది ఆయన ఉండే దేశమేనటగా? మళ్లీ కనిపిస్తాడేమో బహుమానాలిచ్చి పుచ్చుకుందామని చూస్తున్నాను!" అన్నాడు రూపధరుడు.

ముసలివాడు తన కొడుకు పేరు వినగానే మట్టిచేతులు ముఖానికి నొక్కుకుని ఏడవసాగాడు. రూపధరుడికి గుండె అవిసిపోయింది. అతను తన తండ్రిని కౌగలించుకుని, "నేనే, నాన్నా! నాకోసం ఇంకా ఎందుకేడుస్తావు? ఇరవై ఏళ్లు యమయాతనలు




అనుభవించి దేశానికి తిరిగివచ్చాను. నా ఇంట చేరి నా భార్యను పెళ్లాడమని పీడించే దుర్మార్గుల నందరినీ చంపేశాను," అన్నాడు.

"ఎంత పని చేశావురా, నాతండ్రీ! ఇథకా వాళ్లు నిన్ను బతకనిస్తారా? ఇరుగు పొరుగు దేశాలవాళ్లనుకూడా సాయం తెచ్చి నీపైకి వస్తారే!" అన్నాడు పిపీలకుడు.

"భయపడకు, నాన్నా. వెళ్లి భోజనం చేద్దాం పద. వంట చెయ్యమని చెప్పాను!" అంటూ రూపధరుడు తండ్రిని ఇంటికి తీసుకువచ్చాడు. అక్కడ రూపధరుడి పందులకాపరీ, పశువులకాపరీ వంట సిద్ధం చేసి ఉంచారు. పిపీలకుడు స్నానం చేసి



వచ్చేసరికి ఎంతో దృఢంగానూ నిఖారుగానూ ఉండటం గమనించి రూపధరుడు ఆశ్చర్యపోయాడు. తరవాత వారంతా కలిసి కూచుని భోజనాలు చేశారు.

ఈలోపల ఇథకా నగరంలో రూపధరుడు చేసిన హత్యలవార్త కార్చిచ్చులాగా వ్యాపించింది. అనేకమంది హాహాకారాలు చేస్తూ, ఏడుస్తూ రూపధరుడి ఇంటి చుట్టూ మూగారు. ఎవరి శవాలను వారు గుర్తించి పట్టుకుపోయారు.

చాలా దూరప్రాంతాలనుంచి వచ్చిన వారు తమ బంధువుల శవాలను వాటివాటి దేశాలకు పడవలమీద పంపేశారు.

తరవాత నగరంలో సభ జరిగింది. దుర్బుద్ధి తండ్రి అందరినీ రెచ్చగొట్టాడు. "స్నేహితులారా, ఈ మనిషి చేసిన హత్యాకాండ దారుణమైనది. ఇతను ఎన్నో పడవలనూ, ఎంతోమంది పైకి రావలిసిన యువకులనూ వెంటబెట్టుకుని యుద్ధానికి పోయి, పడవలన్నిటినీ పొగొట్టుకున్నాడు. మనుషులందరినీ పోగొట్టుకున్నాడు. ఇప్పుడు ఒంటరిగా తిరిగివచ్చి దేశంలో ఉన్న మంచి యువకులందరినీ తన పొట్టన పెట్టుకున్నాడు. ఈ దుర్మార్గుడు ఏ పైలాస్‌కో, ఎలిస్‌కో పారిపోకముందే మనం పగ తీర్చుకోవాలి. మన కుర్రవాళ్లను చంపిన హంతకు



లను శిక్షించకపోతే మన వంశాలకు అది తీరని కళంకమవుతుంది. నామటుకు నేను చావనైనా చస్తాను గాని అలాటి అవమానం సహించను. ప్రతీకారానికి ఉపక్రమించండి! కదలండి!" అన్నాడాయన.

ఆయన మాటలు వింటుంటే, ఆయన కన్నీరు చూస్తూంటే ప్రేక్షకుల గుండెలు నీరయాయి. అయితే సరిగా ఆ సమయానికే అక్కడికి ఒక మనిషి వచ్చాడు. రూపధరుడు చంపకుండా విడిచిన ఇద్దరిలో ఇతను ఒకడు. అతను ఆ సభతో, "ఇథకా పౌరులారా, నామాట ఒకటి వినండి. ఆ హత్యాకాండ జరిగినప్పుడు నేనక్కడే ఉన్నాను. రూపధరుడి పక్కన బుద్ధిమతీ దేవి నిలబడిఉండటం నేను కళ్లారా చూశాను. ఈ హత్యాకాండ దైవనిర్ణయంతో జరిగింది!" అన్నాడు.

ఈ మాటలకు అక్కడ చేరినవారందరూ వెలవెల పోయారు.

ఇంకొక వృద్ధుడు లేచి, "జరిగిపోయిన దేదో జరిగిపోయింది. ఇంకా ఎందుకు రక్తపాతం చేస్తారు? ఇంతటితో పోనివ్వండి! అసలు తప్పు మీ కొడుకులది. వారిని నిగ్రహించమని నేను మీతో ఏనాడో చెప్పాను; మీరు లక్ష్యపెట్టలేదు. రూపధరుడు తిరిగి రాడన్న ధైర్యంతో మీవాళ్లు అతని ఇల్లు



కొల్లగొట్టి అతని భార్యకు తీరని అవమానం కలిగించారు; అందుకు అనుభవించారు. ఇందులో మరెవరి తప్పూ లేదు," అన్నాడు.

ఈ మాటలతో సగంమంది తృప్తిపడి సభనుంచి వెళ్లిపోయారు. మిగిలిన సగం మందీ ప్రతీకారానికే నిశ్చయించారు. దుర్బుద్ధి తండ్రి నాయకత్వాన వీరు ఆయుధాలు తీసుకుని బయలుదేరారు. వారు పిపీలకుడుండే చోటికి చేరుకునేసరికి రూపధరుడూ, అతని తండ్రీ మిగిలినవారూ ఆయుధాలు తీసుకుని వారిని ఎదుర్కోవటానికి సిద్ధమైనారు.

ధీరమతి తన తండ్రితో, "నాన్నా, ఇవాళ వీరందరికీ నా ప్రతాపం చూపిస్తాను చూడు!" అన్నాడు.

పిపీలకుడు పరమానందంతో, "ఈశ్వరా, ఇది నా జీవితంలో ఎంత పర్వదినం! నా కొడుకూ, మనవడూ ప్రతాపంలో పోటీ పడుతున్నారు!" అన్నాడు. ఆయనకు ఎక్కడ లేని ఉత్సాహమూ వచ్చింది. ఆయన తన ఈటెను ఎత్తి బలంగా దుర్బుద్ధి తండ్రిపైకి విసిరాడు; ఆయన ఆ దెబ్బకు పడిపోయాడు. రూపధరుడు మొదలైనవారు మిగిలినవారిపై పడ్డారు.

కాని అంతలోనే వారికి బుద్ధిమతీదేవి వాక్కు వినిపించింది:

"ఇక చాలు పౌరులారా! ఈ రక్తపాతం ఇంతటితో ఆపండి!"

ఆ కంఠం వినగానే అందరూ తెల్లబోయారు. వారి చేతులనుంచి ఆయుధాలు జారి కింద పడిపోయాయి. రూపధరుడిపైన పగ తీర్చుకోవచ్చినవారు వెనక్కు తిరిగి నగరానికి వెళ్లిపోయారు.

తరవాత రూపధరుడికి శత్రుభయం లేకుండా పోయింది. అతను తన భార్యతోనూ, కుమారుడితోనూ, తండ్రితోనూ సుఖంగా జీవించాడు.

—(అయిపోయింది)



# తమాషాలు

1. మా ఇంటికి వచ్చిపోయే బంధువులు అయిదుగురున్నారు. ఒకరు రోజు విడిచి రోజు వస్తారు. రెండోవారు మూడురోజుల కొకసారి వస్తారు. మూడోవారు నాలుగురోజుల కొకసారి వస్తారు. నాలుగోవారు అయిదురోజుల కొకసారీ, అయిదోవారు ఆరురోజుల కొకసారీ వస్తారు. వారందరూ సంవత్సరాదినాడు మా ఇంటికి వచ్చారు. తరవాత మూడునెలల కాలంలో (90 రోజులలో) వారందరూ మా ఇంటికి వచ్చిన రోజులు ఎన్నో, ఏ ఒకరూ రాని రోజులెన్నో చెప్పగలరా?

2. 1932 లో ఒక తాతకూ మనవడికీ ఈ విధంగా సంభాషణ జరిగింది:

"తాతా, నేను పుట్టిన సంవత్సరంలో చివర రెండు అంకెలూ సరిగా ఇప్పటి నా వయసు!" అన్నాడు మనవడు.

తాత కొంచెం ఆలోచించి, "నా వయసుకూడా నేను పుట్టిన సంవత్సరం చివరి రెండు అంకెలేరా!" అన్నాడు. 1932 నాటికి ఎవరి వయసు ఎంత?

3. రంగడూ రాముడూ ఒక పందెం వేసుకున్నారు.

"రంగడూ నీదగ్గిర ఎంత డబ్బున్నదో అంతా నేను నీకిస్తాను. అలా ఇచ్చినప్పుడల్లా నువు నాకు రూపాయీ ఇరవై నయాపైసలు ఇవ్వాలి?" అన్నాడు.

రంగడు సరేనన్నాడు. రంగడి జేబులో ఉన్న డబ్బు ఎంచి రాముడు అంతా ఇచ్చేసి తన రూపాయీ ఇరవై నయాపైసలు తాను తీసుకున్నాడు. రెండోసారి రంగడిదగ్గిర ఉన్న మొత్తానికి సమానమైనది తన జేబులోనుంచి ఇచ్చి మళ్లీ ఒక రూపాయి ఇరవై నయాపైసలు పుచ్చుకున్నాడు. కాని రాముడు మూడోసారి తన రూపాయి ఇరవై నయాపైసలు పుచ్చుకునేసరికి రంగడి జేబు ఖాళీ అయింది. రంగడి దగ్గిర మొదట ఉండిన డబ్బెంత?

---

[గత నెల ప్రశ్నలకు సమాధానాలు]

1. పెద్దవెలగకాయలు కొనటమే లాభం.

2. ఈ ప్రశ్నలో ఒక పొరపాటు దొర్లింది. ఝారీలలో ఒకటి చిన్నది; ఒకటి పెద్దది. చిన్న ఝారీలో నెయ్యి త్వరగా చల్లారుతుంది.

3. ప్రతి స్టేషనునుంచీ మిగిలిన 7 స్టేషనులకూ టిక్కెట్లుంటాయి. అందుచేత ఎనిమిది స్టేషన్లలోనూ కలిపి 56 రకాల టిక్కెట్లుంటాయి.



# సజ్జన సాంగత్యం

మహేంద్రగిరి అనే గ్రామంలో దేవలుడనే పెద్దమనిషి ఉండేవాడు. ఆయన చాలా నిష్ఠాపరుడు, భగవంతుడియందు అచంచలమైన విశ్వాసం గలవాడు. ఆయనకు పెళ్ళీ, సంసారబాధ్యతలూ లేవు, ఆయన జీవితం సత్కార్యాలలోనే గడిచిపోయింది.

దేవలుడు తనకు ఉన్నదానిలోనే మితంగా ఖర్చుచేస్తూరావటంచేత కొంతకాలానికి రెండువేలరూపాయలు పోగుచేయగలిగాడు. దాన్ని ఏవిధంగా వినియోగపరచాలా అని ఆయన ఆలోచిస్తూ ఉన్న సమయంలో ఆయనకొక సంతోష వార్త తెలిసింది. హరిద్వారంలో ఒక పెద్ద మఠం ఉన్నదనీ, అక్కడ యాత్రికులకూ, సన్యాసులకూ చక్కని సౌకర్యాలు జరుగుబాటు అవుతున్నాయనీ తెలిసింది. తాను కూడబెట్టిన డబ్బంతా ఆ మఠానికి ఇచ్చేసి, యాత్రాఫలంకూడా దక్కించుకుందామని దేవలుడికి తోచింది. అందుచేత ఆయన ఒక మంచి రోజున, భీముడనే తన నౌకరును వెంటబెట్టుకుని హరిద్వారానికి బయలుదేరాడు.

ఆ ఇద్దరూ కొద్దిరోజులు కాలినడకన ప్రయాణంచేసి ప్రయాగ చేరుకున్నారు. అక్కడినుంచి పడవలపైన హరిద్వారం వెళ్ళటానికి నిశ్చయించుకున్నారు. ప్రయాగ చేరుతూనే వారు త్రివేణిలో స్నానంచేసి ఒక సత్రంలో బస చూసుకున్నారు.

ఆ రోజులలో ప్రయాగ పూర్తిగా పాపిష్ఠి నగరం. తాగుబోతులూ, జూదగాళ్లూ, దొంగలూ, దోపిడీలు చేసేవాళ్లు విజృంభించారు. ఎక్కడ చూసినా లేకివినోదాలుండేవి. భగవద్భక్తీ, పుణ్యచింతనా, పాపభీతీ కలవాళ్ళు కేవలం అమాయకుల కింద జమ అవుతూండేవారు. రోజూ ఏదో ఒకమూల హత్యలు జరుగుతూనే ఉండేవి. రాజోద్యోగులుకూడా ధర్మాన్ని తప్పి నడిచే

కె. విజయకుమార్

వాళ్ళు కావటంచేత ఆ నగరంలో సాధారణంగా ఎవరికీ న్యాయం జరిగేదికాదు.

ఈ సంగతులు దేవలుడు తెలుసుకున్నాడు గాని లక్ష్యపెట్టలేదు. ఆయన భీముడితో, "ఒరే, అన్ని పాపాలనూ సరి చేయగలవాడు ఆ ఈశ్వరుడున్నాడు. మనం భయపడవలసిన పనిలేదు," అన్నాడు.

వాళ్ళు విడిది చేసిన సత్రం దగ్గిరికి రమేశుడనేవాడు వచ్చాడు. ఇతను ముప్ఫై నిండని యువకుడు. చిన్నతనం నుంచీ అల్లరిచిల్లరగా తిరిగి తాగుడూ, జూదమూ మొదలైన దుర్వ్యసనాలన్నీ అలవరుచుకున్న వాడు. ఎంతోమందిదగ్గిర అప్పులుచేసి ఎగవేశాడు. తాను జూదంలో గెలిచినప్పుడల్లా రాజోద్యోగులకు లంచాలు పెట్టుతూ ఉండటంచేత, అతనికి వాళ్ళ అండ బాగా ఉండేది. అందుచేత అప్పులవాళ్ళు అతన్ని ఏమీ చెయ్యలేకపోయారు. కాని అతనికి ఎరిగున్నవాళ్లనుంచి అప్పు పుట్టే అవకాశం లేకుండాపోయింది. అందుచేత అతను చేతిలో డబ్బు అడనప్పుడు సత్రాలచుట్టూ తిరిగి పరదేశీయులను మంచిమాటలతో లోబరచుకుని వారికి వినోదాలు చూపించి, తన అవసరాలకుకూడా వారిచేత ఖర్చు పెట్టించేవాడు.



రమేశుడు దేవలుణ్ణి సమీపించి ఆయన కథ అంతా తెలుసుకున్నాడు. కపటం ఎరగని దేవలుడు తనవద్ద రెండువేల రూపాయలున్న సంగతి రమేశుడికి చెప్పేశాడు. అంతా విని రమేశుడు, "ఎల్లుండిదాకా మీకు పడవ దొరకదు. ఇది చాలా చెడ్డ ఊరు. ఈ సత్రంలో మీరు ఉండవచ్చు గాని, ఇక్కడి భోజనం మీకు సరిపడదు. అందుచేత నా సలహా ఏమంటే మీరు నా వెంట వచ్చెయ్యండి. మీకు ఒక స్నేహితుడి ఇల్లు చూపిస్తాను. అక్కడ మీకు శుచిగా భోజనం అమరుతుంది. ఈ పూట నేనూ అక్కడే భోజనం చేస్తున్నాను," అన్నాడు.



"బాబూ, ఇవాళ ఏకాదశి. అందుచేత నాకు ఉపవాసం. ఎక్కడనైనా భజనగాని, పురాణ కాలక్షేపంగాని, తత్వోపదేశంగాని వున్నట్టయితే అక్కడికి పోదామనుకుంటున్నాను. మా భీముడు ఊరు చూడ పోతాడు. వాడికి తిండి ఇబ్బందిలేదు, ఎక్కడైనా తినెయ్యగలడు," అన్నాడు దేవలుడు.

"నాకు ఏకాదశీ ఉపవాసాలు అలవాటు లేదు. కాని మీతోబాటు నేనుకూడా భోజనం మానేస్తాను. రెండుమూడు వీధుల అవతల సరస్వతీ స్వాములవారు రోజూ జ్ఞానబోధ చేస్తారని విన్నాను. అక్కడికి పోదామా ఏమిటి?" అన్నాడు రమేశుడు.



దేవలుడు సంతోషంతో లేచి తన నౌకరుతో, "ఒరే భీమా, నా సంచీ, పైబట్టా అందుకో!" అన్నాడు. భీముడు సత్రం గదిలోకి వెళ్ళి కొద్దిసేపటిలో తన యజమాని సంచీ, పైబట్టా తెచ్చి ఇచ్చాడు.

తరవాత దేవలుడూ రమేశుడూ కలిసి వీధులవెంట నడవసాగారు. చాలాదూరం వెళ్ళాక దేవలుడు, "నాయనా, మనం వెళ్ళే చోటు నీకు తెలియదల్లే ఉందే?" అన్నాడు.

"మర్రిచెట్టు గుర్తుకోసం చూస్తున్నాను, బాబూగారూ. రెండడుగులు వేయండి," అన్నాడు రమేశుడు. వాళ్ళు మరికొంత దూరం వెళ్ళాక ఒక అడ్డ వీధీ, అందులో మర్రిచెట్టూ కనిపించాయి. "చూశారా? మనం సరిగానే వచ్చాం. ఆ కనిపించే తెల్ల ఇంట్లోనే జ్ఞానబోధ," అన్నాడు రమేశుడు.

అది జూదాలాడే ఇల్లు. ఆ సంగతి రమేశుడికి బాగానే తెలుసు, కాని దేవలుడికి తెలియదు. వాకిలి బయట లాఠీ పట్టుకుని నిలబడ్డ మనిషిని చూసి ఆయన ఆశ్చర్యపడి, "జ్ఞానబోధ జరిగే చోటకూడా ద్వార రక్షకులుంటారా? నేనెక్కడా వినలేదే!" అన్నాడు ఆశ్చర్యంగా.

"దుర్మార్గులు లోపలికి రాకుండా కాపలా ఉంచి ఉంటారు. మనకేమీ అడ్డు



లేదులెండి," అంటూ రమేశుడు లోనికి దారితీశాడు.

లోపల ఆటే వెలుతురు లేదు. చాలా మంది జనం ఉన్నట్టు దేవలుడు ఊహించాడు. ఒక పక్కగా కొందరు కూచుని ఏదో తాగుతున్నారు. అందరికీ లోటాలలో తెల్లటి పానీయం అందిస్తున్న ఒక మనిషి రమేశుణ్ణి పేరుపెట్టి పిలిచి ఆహ్వానించాడు.

"క్షణం కూచుని పోదాం. పెద్దమనిషి పిలుస్తున్నాడు. వెళ్లకపోతే బాగుండదు," అన్నాడు రమేశుడు దేవలుడితో రహస్యంగా. ఇద్దరూ వెళ్లి ఒక పక్కగా అరుగుమీద కూచున్నారు.

"వీరంతా తాగేదేమిటి?" అని దేవలుడు రమేశుణ్ణి అడిగాడు.

"పాలలో ఆరోగ్యకరమైన మూలికలు వేసి కాస్తారు. ఉపవాసం ఉండేవారు తప్పక తాగాలి. ఇది ఇక్కడి ఆచారం!" అని రమేశుడు అంటూ ఉండగానే ఒక నౌకరు రెండు లోటాలతో భంగు తెచ్చి ఇచ్చాడు. దేవలుడు వద్దుమొర్రో అంటున్నా వినక రమేశుడు ఆయనచేత ఒక లోటాడు భంగు తాగించాడు.

"ఛీ, ఛీ! ఇదేం పాలు! బుద్ధి పొరపాటై తాగాను. మనం తక్షణం ఇక్కడినుంచి పోదాం పద!" అన్నాడు దేవలుడు.





"మనంవచ్చిన అసలుపని మరవకండి," అంటూ రమేశుడు నౌకరును పిలిచి, "తత్వ విచారం సాగుతున్నదా?" అని వాణ్ణి అడిగాడు. 'జూదం సాగుతున్నదా?' అని అతని ఉద్దేశం.

నౌకరు ఇంకా లోపలికేసి చెయ్యి ఊపాడు. రమేశుడు దేవలుడి చెయ్యి పట్టుకుని లోపలి చావడిలోకి తీసుకుపోయాడు. ఇక్కడ వెలుగే లేదు. దీపాలు పెట్టుకుని పాచికలతో అనేకమంది జూదం ఆడుతున్నారు.

ఈ సంగతి గ్రహించి దేవలుడు, "చూశావా, నాయనా? నువు దారితప్పి నన్ను జూదాలాడే చోటికి తెచ్చావు. జరిగిన పొరపాటు జరిగిపోయింది. ఇకనైనా వెళ్లిపోదాం పద!" అన్నాడు.

"బాబుగారూ, నన్ను క్షమించండి. జూదరులు కానివాళ్లు ఈ గడపదాటి లోపలికి రాకూడదు. లోపలికి వచ్చిన పాపానికి ఒక్క పందెం కాచి వెళ్లిపోదాం. ఇది ఇక్కడి ఆచారం. దురదృష్టవశాత్తూ నాదగ్గిర చిన్న చిల్లిగవ్వకూడా లేదు. ఒక్క అయిదు రూపాయలు అప్పు పెట్టారంటే పందెం కాస్తాను. ఓడినా గెలిచినా మనం మన దారిన వెళ్లిపోవచ్చు. అదీగాక నాది గెలుపుచెయ్యి. మీడబ్బుకేమీ ఫరవాలేదు," అన్నాడు రమేశుడు.

మొదట దేవలుడు ససేమిరా అన్నాడు. రమేశుడు కంట తడిపెట్టుకుంటూ, "పందెం కాయకుండా బయటికి వెళ్లామంటే నన్ను ఇక్కడివాళ్లు చితకపొడిచేస్తారు. పరదేశీ గనక మిమ్మల్ని ఏమీ చేయరు. ఒక్క అయిదు రూపాయలివ్వండి," అని బతిమాలాడు.

"నువు పందెం గెలిచే పక్షంలో ఆడబ్బు తీసుకోనని ప్రమాణంచేస్తే అయిదురూపాయలిస్తాను. జూదంలో గెలిచిన సొమ్ము అంటవచ్చా, నాయనా? ప్రాజ్ఞుడివి కాదూ?"

అన్నాడు దేవలుడు. భంగుప్రభావంవల్ల ఆయనకు ఉద్రేకం వచ్చేస్తున్నది.

ఈమాట అంటూ అయన తన సంచీ మూతి విప్పి, లోపల చెయ్యిపెట్టి తెల్ల బోయాడు. దానిలో ఆయన చెంబూ, బట్టలూ ఉన్నాయిగాని రూపాయల మూట లేదు

"డబ్బంతా ఎవరో కాజేశారు! మఠానికి ఇవ్వాలనుకున్న డబ్బు!" అని దేవలుడు పెద్దగా అరిచాడు.

ఆ డబ్బు ఏమయిందీ రమేశుడు ఊహించలేకపోయాడు. భంగు తాగినచోట దేవలుడు సంచీని అరుగుమీద పెట్టినప్పుడు ఎవరైనా తీశారేమో!

"మీ నౌకరు భీముడు నమ్మకస్తుడేనా? ఎందుచేతనంటే అలాటివాడిదగ్గిర డబ్బుండటం అపాయకరం. ఒక్కగంటలో వాడి డబ్బంతా వొలిచేస్తారు. ఇది చాలా చెడ్డ ఊరు!" అన్నాడతను దేవలుడితో.

"పాపిష్ఠి డబ్బు! డబ్బుకన్న భీముడు చిక్కున పడకుండా ఉండటం ముఖ్యం. వాణ్ణి ఒంటరిగా తిరగనివ్వరాదు. వినోదం చూస్తానని వెళ్లాడు. వాణ్ణి ఎలా పట్టు కోవటం?" అన్నాడు దేవలుడు.

"మైదానంలో దొరకవచ్చు! అక్కడికి పోదాం పదండి!" అన్నాడు రమేశుడు.



ఇద్దరూ కలిసి మైదానానికి వెళ్లారు. మైదానంలో చాలా పందిళ్లు వేసివున్నాయి. వాటికింద నాట్యాలూ, గారడీలూ మొదలైన వినోదాలు సాగుతున్నాయి. మైదానం మధ్య పొట్టేళ్ల పందాలు జరుగుతున్నాయి.

అక్కడి దృశ్యాలన్నీ చూస్తున్నకొద్దీ దేవలుడికి ఏవగింపు జాస్తి కాసాగింది. దానితో బాటే భంగు నిషాకూడా హెచ్చింది. భీముడు ఎక్కడా కనిపించకపోవటం ఆయనకు మరింత ఉద్రేకం కలిగించింది. నిజానికి భీముడు పొట్టేళ్ళపందెం జరిగే చోటనే ఉన్నాడు. వాడు తన యజమానిని చూడగానే జనంవెనక దాక్కున్నాడు.



ఉన్నట్టుండి దేవలుడికి పట్టరాని ఆవేశం వచ్చింది. "నీచులారా! మీ పాపాలకు పొట్టేళ్లను అడ్డం పెడతారా?" అంటూ ఆయన జనాన్ని తోసుకుని వెళ్లి, పోట్లాడే పొట్టేళ్లలో ఒకదాన్ని అమాంతం ఎత్తుకుని పరిగెత్తసాగాడు.

అది నగరపు కొత్వాలుగారి పొటేలు. దానిమీద అనేకవేల రూపాయలు పందాలు కాశారు ఊరిలో ఉండే పెద్దలు. ఎవరో వచ్చి ఆ పొటేలును ఎత్తుకుపోతూండటం చూసి జనం గగ్గోలుపెడుతూ ఆయన వెంట పడి పట్టుకున్నారు. ఆ సమయానికే దేవలుడు మైకంవచ్చి పడిపోయాడు.

మళ్ళీ స్పృహ తెలిసేసరికి ఆయన ఆ వూరి ఖైదులో ఉన్నాడు. రాత్రి చాలా భాగం గడిచి తెల్లవార వస్తున్నది. కిందటి రోజు జరిగినదంతా ఆయన జ్ఞాపకం తెచ్చుకుని, "మఠాని కిద్దామనుకున్న డబ్బు పోయింది, తాగగూడనిదేదో తాగాను, చెయ్యగూడనిదేదో చేసి బందిఖానాలో పడ్డాను, భీముడేమయాడో తెలియదు! ఇదంతా జరగటానికి నేనేం తప్పు చేసిఉంటాను? నావల్ల ఏ తప్పూ జరగలేదే! రమేశుడి తప్పా! కాదు, పాపం, అతను మంచివాడు. దారి తప్పి నన్నక్కడికి తీసుకుపోయాడు. అతనిలోకూడా దురుద్దేశం ఏమీ లేదు. ఇది భగవంతుడు పెట్టిన పరీక్షేగాని మరేమీ కాదు!" అని రూఢి చేసుకున్నాడు.

తెల్లవారుతూనే రమేశుడు వచ్చాడు.

"బాబుగారూ, నా మూలంగా మీకు చాలా శ్రమ కలిగింది. మీ విడుదలకు కొత్వాలు అనుమతి ఇదుగో! మనం పోదాం పదండి!" అని అతను దేవలుడితో అన్నాడు.

"విచారణకూడా జరగకుండా విడుదల ఎలా చేశారు, నాయనా?" అన్నాడు దేవలుడు.

"నిన్న మిమ్మల్ని రాజభటులు పట్టుకుపోగానే నేను కొత్వాలుగారింటికి వెళ్ళాను.



అయన కొందరు మిత్రులతో పాచికలాడి డబ్బు పోగొట్టుకుంటున్నాడు. నన్ను చూడ గానే అయన, 'రా, రమేశూ! నా ఆట కాస్సేపు ఆడు!' అన్నాడు. అర్ధరాత్రిదాకా ఆడాను. ప్రతి పందెమూ గెలిచాననుకోండి. నేను వచ్చిన పని తెలుసుకుని అయన విడు దల పత్రం ఇవ్వటమేగాక, నేను గెలిచిన దానిలో సగం ఇచ్చాడు. ఇదుగో రెండువేల రూపాయలు!" అన్నాడు రమేశుడు.

"ఎంత తప్పు చేశావు, నాయనా? నేను ఖైదులోనే ఉంటాను. నన్ను న్యాయాధి కారి విచారించి శిక్షించనీ. అది అలా ఉంచి, జూదంఆటద్వారా నా విడుదల జరగటం భావ్యంకాదు. చెడ్డనుంచి మంచి ఎలా వస్తుంది, బాబూ?" అన్నాడు దేవలుడు.

రమేశుడీ మాటలు విని తెల్లబోయాడు. అతను దేవలుడివంటి సత్పురుషుణ్ణి ఎన్నడూ చూడలేదు. ప్రపంచంలో అలాటి వారుంటారనికూడా అతనికి తెలియదు. అటువంటివాడికి అన్యాయం చేసి ఖైదు ప్రాప్తికూడా కలిగించినందుకు అతని అంత రాత్మ దహించుకుపోతున్నది.

రమేశుడు కొంచెం ఆలోచించి, "బాబు గారూ, కొత్వాలు జారీచేసినది రాజాజ్ఞతో సమానం. అందులో మీరు తక్షణం ఖైదు విడిచి బయటికి వెళ్ళాలని శాసించి ఉన్నది!" అన్నాడు.

"అలాగా, నాయనా? శాసనం పాటించి తీరవలిసిందే! పోదాం పద!" అన్నాడు దేవలుడు.

ఇద్దరూ కలిసి సత్రానికి వచ్చారు. సత్రం అధికారి దేవలుణ్ణి చూసి, "అయ్యా, మీరు హరిద్వారానికి వెళుతున్నారుకాబోలు. కొద్దిసేపట్లోనే ఒక పడవ బయలుదేరు తున్నది!" అన్నాడు.

"అయితే నేను బయలుదేరుతాను," అన్నాడు దేవలుడు.

"బాబుగారూ, నాకు ఒక్క మేలు చెయ్యాలి! ఈ రెండువేలూ పట్టుకుపోయి మీరు ఆ మఠానికి అర్పించండి. నా మూలాన మీరు సొమ్ము పోగొట్టుకున్నారు. నేను మీకు ఇంతకన్న ఏం చెయ్యగలను?" అన్నాడు రమేశుడు.

"ఆ డబ్బు నేను అంటను, నాయనా! అన్యాయంగా సంపాదించిన సొమ్ము. దాన్ని అనాథలకు ఇచ్చెయ్యి. భీముడు కనిపిస్తే ఇంటికి వెళ్లిపొమ్మని చెప్పు! ఈ దూర దేశంలో భగవంతుడు నిన్ను బంధువులాగా నాకు తటస్థపరిచాడు!" అన్నాడు దేవలుడు.

ఇద్దరూ కలిసి గంగానది రేవుకు వెళ్లారు. దేవలుడు ఎక్కిన కొద్దిసేపటికల్లా పడవ కదిలింది. వెళ్ళిపోయే ఆ పడవకేసి చూస్తూ రమేశుడు కన్నీరు కార్చాడు. ఆ క్షణానే అతను తన జీవిత విధానం పూర్తిగా మార్చుకోవటానికి నిశ్చయించుకున్నాడు. ఆ డబ్బుతో తన బాకీలన్నీ తీర్చేసి తన గ్రామానికి వెళ్ళి అక్కడ అందరిలాగా బతకటానికి నిశ్చయించుకున్నాడు.

దేవలుడెక్కిన పడవ ఒక అరమైలు వెళ్ళిందో లేదో భీముడు నది ఒడ్డున పరిగెత్తుకువస్తూ కనిపించాడు. చుక్కానివాడితో దేవలుడు, "బాబూ, పడవ కొంచెం ఒడ్డుకు పట్టు. ఆ వచ్చేవాడు మా మనిషి!" అన్నాడు.

భీముడు పడవలోకి ఎక్కుతూనే తన రొండిన ఉన్న డబ్బుమూట తీసి యజమానికి ఇస్తూ, "ఆ మనిషి మొహం చూసి నాకు అనుమానం తగిలి డబ్బు నాదగ్గిర దాచాను, బాబూ!" అన్నాడు.

తన డబ్బు తనకు తిరిగి కనపడగానే దేవళుడు తన కష్టాలన్నీ మరిచాడు. ఆయన భీముడితో, "అలా అనకూడదురా! అతను లేకపోతే ఆ వూళ్ళో మనం ఎన్ని కష్టాలు పడి ఉందుమో! రమేశుడు చాలా మంచి హృదయం గల మనిషి!" అన్నాడు. పడవ సాగిపోయింది.





# ప్రకృతి వింతలు

## 6

మర్నాడు ఉదయం పడవను ఒడ్డుకు లాగే పని పడింది. పడవకాప్టెను నన్ను నిద్రలేపి, "మీరూ ఆ కుర్రవాడూ కలిసి వెళ్లి ఆహారం వేటాడి తెస్తారా?" అన్నాడు. నేను సరేనని కుర్రాడికేసి చూస్తే వాడు మంటవద్ద కూచుని వేటకోసం బాణాలు తయారు చేస్తున్నాడు. అవన్నీ ఒక రకంగా లేవు. అదేమని అడిగితే, "అన్ని జంతువులూ ఒకటిగా ఉండవు. ఈ పెలాగా తయారుచేసిన ఈ బాణం అన్నిటి కన్న బలమైనది. దీనితో జాగ్వారు పులిని ప్రతిఘటించవచ్చు, అడవిపందులను వేటాడవచ్చు. ఈ ముళ్లబాణం చేపలను వేటాడటానికి. ఈ పెద్దబాణం దుప్పులనూ, ఇతర మృగాలనూ కొట్టటానికి," అన్నాడు.

కొన్ని బాణాలకు కోతి ఎముకను ములుకులుగా చెక్కి అమర్చాడు. ఆ బాణాలు కోతులను చంపటానికి. పక్షులను చంపటానికి, చంపకుండా పడగొట్టి పట్టుకోవటానికి వేరువేరు బాణాలున్నాయి.

మేము ఈసారి అరణ్యంలోకి పోతున్నామనుకున్నాను గాని కుర్రవాడు దోనెలో నన్ను ఎక్కించాడు. తెల్లవారుజామున తాబేలు గుడ్లు దొరుకుతాయట. ఆ పని చూసి తరవాత వేటకు వెళ్లాలని వాడి ఉద్దేశం. తాబేలు గుడ్లు సంపాదించటం చాలా కష్టం.

మేము మా దోనెను నది ఒడ్డునే పోనిచ్చాం. ఒడ్డువెంబడి పెద్ద మానులే గాక అక్కడక్కడా ఇసకపర్రలున్నాయి. మేము ఒక ఇసకపర్ర దగ్గిర ఆగాం. ఇసకలో గుండ్రని గుర్తులు చూపించి, అవి తాబేలువని కుమేవావా చెప్పాడు. ఆ కిందటిరోజు తాబేలు నీటిలోంచి ఒడ్డుకు వచ్చి, చుట్టూరా ఇతర జంతువులేవీ లేకుండా చూసి

టిబోర్ సెకెల్యే





ఇసకలో గజం లోతున గొయ్యి తవ్వి అందులో గుడ్లు పెట్టిందనీ, వాటిని ఇసకతో కప్పి అయిదు గజాల మేర చదును చేసిందనీ, మొసళ్లూ, కోతులూ ఆ గుడ్లను పసికట్టకుండా ఉండగలందులకు అలా చేస్తూందనీ వాడు చెప్పాడు.

ఇసకలో వాడు నాకు ఒక పూర్తి కథ చూపించాడు. తాబేలు గుర్తులు చూసి మరబూ అనే పక్షి గుడ్లకోసం వచ్చి ఆ ప్రాంతంలో వాలింది. దాని కాలి గుర్తులున్నాయి. అదే సమయానికి మొసలి ఒకటి ఆకలితో వచ్చింది. ఆకలిగా ఉన్న మొసలి దేన్నయినా పట్టేస్తుంది. పక్షి ఎగిరిపోయి ఉండవచ్చు, కాని తాబేలుగుడ్ల ఆశతో అది ఎగిరిపోక మొసలితో పోట్టాట పెట్టుకుని దానికి చిక్కింది. దాని ఈకలూ, రక్తం మరకలూ ఇసకలో ఉన్నాయి. పక్షిని చంపినాక మొసలి తాబేలుగుడ్లకోసం రెండుచోట్ల తవ్వి చూసింది. గుడ్లు దొరకలేదు. తోకను ఇసకపైన వేసి ఈడ్చుకుంటూ అది నీటిలోకి వెళ్లిపోయింది.

తాబేలు చదునుచేసిన ప్రదేశం నడిమధ్య కుర్రవాడు తన కత్తి పొడిచి పైకిలాగాడు. కత్తి చివర గుడ్డుసొన అంటింది. వాడు కొద్ది నిమిషాలసేపు ఇసకలో తవ్వినాక గుడ్లు బయటపడసాగాయి. అవి తెల్లగా నిమ్మకాయలంత ప్రమాణంలో ఉన్నాయి. వాటి పైన పెంకుండదు, అవి తోలుగుడ్లు. అక్కడ మాకు నూటఇరవై గుడ్లు దొరికాయి.

ఇన్ని గుడ్లు పెట్టే తాబేలు ఒక గజంకన్న ఎక్కువ నిడివి ఉంటుందనీ, అది ఏడాదికొకసారి, వేసవికాలం చివరి నెలలో, ఇసకలో గుడ్లు పెట్టి పోతుందనీ, ఆ వేడికి అవి పొదిగి పిల్లలై, వానలకు నది పొంగి ఇసకదిబ్బలు కరిగినప్పుడు నీటిలోకి జారబడతాయనీ కుర్రవాడు చెప్పాడు.

మేము మా వెంట తెచ్చిన ఒక మట్టి పాత్రలో పది తాబేలుగుడ్లు ఉడకబెట్టి

అక్కడే కూర్చుని తిన్నాం. అవి కోడిగుడ్ల కన్న ఉప్పగా ఉన్నాయి.

అక్కడినుంచి మళ్లీ దోనెలో బయలుదేరి వెళ్లాం. ఒక చిన్న కయ్యలో దోనెనుకట్టేసి, "ఇక అడవిలోకి పోదాం," అన్నాడు. వాడు అరిటాకులు కోసి తాబేలుగుడ్లను వాటిలో పెట్టి అతి నిపుణంగా కట్టి, ఆ మూటలో ఏమున్నదీ ఏజంతువూ పసికట్టరాకుండా చేశాడు. ఆ మూటను దోనెలో పెట్టి అడవి ప్రవేశించాం. తన కత్తితో మొక్కలు నరుకుతూ దారితీశాడు కుర్రాడు.

కొంతదూరం వెళ్లాక వాడు ఆత్రంగా, "అడవిపందులు! మనం చెట్టెక్కాలి!" అన్నాడు. వాడి సహాయంతో నేను సమీపం లోనే ఉన్న చెట్టు ఎక్కి వాణ్ణికూడా పైకి లాగాను. అంతలోనే ఒక వంద అడవి పందులు అమిత వేగంతో, తమ దంతాలతో భయంకరంగా చప్పుడుచేస్తూ, మా వేపుగా పరిగెత్తి వచ్చాయి. మేము చెట్టెక్కపోతే నమ్మకంగా వాటి తాకిడికి పడిపోయి, వాటి కోరలకు బలి అయి ఉండేవాళ్లం.

కుర్రవాడు ఒక అడివిపందిని కొట్ట టానికి విల్లూ బాణమూ సిద్ధం చేశాడు. నేను మందలో ఒక లావుపాటి పందిని చూసి దాన్ని కొట్టమన్నాను.



"చాలా ప్రమాదం. దాన్ని కొట్టితే అన్నీ కలిసి మన చెట్టును కుళ్లగించి మనని చంపేస్తాయి. గుంపు వెనకగా పరిగెత్తే వాటిలో దేన్నయినా కొడితే మిగిలినవి గమ నించవు," అన్నాడు కుర్రాడు. వాడదే చేశాడుకూడా.

అడవిపందుల గుంపు ముందరి భాగం దాటిపోయాక వాడు కొట్టగా పడిపోయిన పంది నేలపై కనిపించింది.

మేము చెట్టు దిగి దానివద్దకు వచ్చాం. అది సుమారు మూడుపందల పౌనుల (నూరు వీశెల) బరువుంటుంది. "దీన్ని మనం ఎలా మోసుకుపోయేట్టు?" అన్నాను.

కాల్చి పట్టుకుపోవాలంటూ వాడు నన్ను నిప్పుపెట్టె అడిగాడు. కాని నావద్ద నిప్పు పెట్టె లేదు. అయినా వాడు విచారించక ఆ ప్రాంతం వెతికి ఒక ఎండు తాటిబోదెను పట్టుకుని దానినుంచి ఒక పలకా, ఒక కర్రా ఆకారంలో రెండుముక్కలు కోశాడు. కర్రలాటి ముక్కను నిలువుగా పట్టుకుని పలకమీద సుమారు ఇరవై నిమిషాలు వేగంగా రుద్దినాక పలకనుంచి పొగ రాసాగింది. పొగ బాగా వస్తున్నప్పుడు వాడు దానికి కొంత పీచు అంటించి ఊది జ్వాల చేశాడు. ఆ జ్వాల సహాయంతో మేము కొద్దిసేపట్లోనే పెద్ద మంట వేసి అందులో పందిని కాల్చాం.

సూర్యుడు పైకి వచ్చాడు, సూర్యకిరణాలు చెట్లలోనుంచి ప్రసరిస్తున్నాయి. అంతలో మాకు వాన చప్పుడులాటిది వినిపించింది. ఎండుటాకులపై వానచినుకులు పడే శబ్దంలాగా అది పటపటమని వినిపించింది. అలిసి విశ్రాంతి తీసుకుంటున్న కుర్రవాడు కాస్త లేచి కూచుని ఆలకించాడు. వాడి ముఖాన ఆందోళన కనబడింది. త్వరలోనే మాకు రెండు గజాల దూరంలో ఒక పెద్ద పాము పరిగెత్తింది. దాని వెనకగా రెండు బల్లులూ, అనేక కాళ్ల జెర్రులూ, కొన్ని కీటకాలూ, మరికొన్ని పాములూ, చిల్లర మృగాలూ అదేవిధంగా పరిగెత్తుకుంటూ రావటం మాకు కనిపించింది. వాన చప్పుడులాటిది అంతకంతకూ సమీపిస్తున్నది.

"ఏమిటి, కుమేవావా?" అన్నాను.

"సిపాయి చీమలు! మనంకూడా పారిపోవాలి!" అన్నాడు వాడు. నేను చెట్టెక్కబోయాను గాని వాడు నన్ను వద్దన్నాడు. వాడు పందిని నిప్పునుంచి తీయ యత్నించాడు గాని అది సాధ్యం కాలేదు. అప్పుడే చీమలు మా కాళ్లను చేరి కుట్టుతున్నాయి. వాటి కాటు దుర్భరం. (ఇంకా వుంది)



## ఫోటోవ్యాఖ్యల పోటీ :: బహుమానం రు. 10 లు

1959 ఫిబ్రవరి సంచికలో ప్రకటింపబడే ఫోటోలకు నమూనాలు





★ పై ఫోటోలకు సరిఐన వ్యాఖ్యలు ఒక్క మాటలోగానీ, చిన్న వాక్యంలోగానీ కావాలి. (రెండు వ్యాఖ్యలకూ సంబంధం వుండాలి.)

★ డిసెంబరు నెల 10-వ తేదీలోగా వ్యాఖ్యలు మాకు చేరాలి. తరువాత చేరే వ్యాఖ్యలు ఎంత మాత్రమూ పరిశీలింపబడవు.

★ మాకు చేరిన వ్యాఖ్యలలో అత్యుత్తమంగా వున్న సెట్టుకు (రెండు వ్యాఖ్యలకు కలిపి) రు. 10/-లు బహుమానం.

★ వ్యాఖ్యలు రెండూ పోస్టుకార్డుపైన వ్రాసి, ఈ అడ్రసుకు పంపాలి:-చందమామ ఫోటో వ్యాఖ్యల పోటీ, మద్రాసు-26.

## డిసెంబరు నెల పోటీ ఫలితాలు

మొదటి ఫోటో : వెలకు దొరకని మందు....

రెండవ ఫోటో : కలదులే ఇందు!

పంపినవారు : బొమ్మగంటి కృష్ణమూర్తి,

II క్లార్క్, పంచాయత్, కారంచేడు, బాపట్ల తా॥ (గుంటూరు జిల్లా.)

బహుమతిమొత్తం రు. 10/- ఈ నెలాఖరులోగా పంపబడుతుంది.

# చిత్రకథ





దాసూ, వాసూలు ఒకరోజున తోటలో జామకాయలు కోసి తెచ్చేందుకు వెళ్ళారు. ఒక కుర్రాడు, వీలయితే వాళ్ళు కోసిన కాయలు ఎత్తుకుపోయేందుకు, వాళ్ళ వెనగ్గా వెళ్ళాడు. దాసూ, వాసూలు కోసిన కాయలు బుట్టలో వేసి చెట్టు చాటున పెట్టారు. వాసు చెట్టుకొమ్మకు ఒక ఖాళీ బుట్టను వేలాడవేసి, దానిని రాయితో కిందపడేలా కొట్టమన్నాడు దాసుతో. దాసు రాయివిసిరి బుట్టతాడు వూడేలా కొట్టాడు. బుట్ట కాస్తా 'టైగర్' తలమీద బోర్లాపడింది. 'టైగర్' అదురుకుని పరిగెత్తేసరికి, కాయలువున్న బుట్టను ఎత్తుకుపోబోతున్న కుర్రాడు దాన్ని చూసి, వింత మృగమనుకుని, 'అయ్యో, బాబో!' అంటూ అక్కణ్ణించి పారిపోయాడు.





Printed by B. NAGI REDDI at the B. N. K. Press Private Ltd., and Published by B. VENUGOPAL REDDI for Sarada Binding Works, 2 & 3 Arcot Road, Madras-26. Controlling Editor: 'CHAKRAPANI'



# ఓ చిన్న జంతు ప్రపంచం

కలకత్తా నగరంలో ఆలీపూర్ అనేచోట ఓ సుందర మైదానంలో దేశ దేశాలనుండి తెచ్చిన రకరకాల బ్రతికివున్న వన్య మృగాలతో, పక్షులతో అందరూ చూచేలా కనుల పండువైన ఓ జంతు ప్రదర్శన శాలను ఏర్పాటు చేసారు. దీన్నే యింగ్లీషులో 'జూ' అంటారు. ఈ 'జూ' మన దేశంలో వున్నవాటన్నిటి లోకి పెద్దది, అత్యంత మనోహరమైంది.

'జూ' చుట్టూ ప్రహారిగోడ వుంది. ఆవరణలో రక రకాల పూలమొక్కలు, పొదరిళ్లు, నీటి కొలనులు వున్నాయి. కొలనుల్లో ఒయ్యారంగా విహరించే హంసలు తెల్ల కాగితపు పడవల్లా కనిపిస్తాయి. చెట్లమీది పక్షులు కిచ కిచ మంటూ, పంజరాల్లోని చిలకలు కిల కిల మంటూ ప్రేక్షకుల్ని ఆహ్వా నిస్తూంటే గూళ్ల లోని నెమళ్లు పురి విప్పి ఆడుతూ రంగు రంగుల పింఛాన్ని చూపిస్తాయి. కుర్రవా డొకడు చుక్కల లేడికి శెనగలు పెడుతూంటే ప్రక్కనున్న దుప్పి పసిరిక తింటూ వుంటుంది. ఇంకొంచం దూరంలో ఓ మనిషి కంగారూ మిత్రా నికి గింజలు అందిస్తుంటాడు. ఓ బోనులోని పులి గాండ్రుమంటూంటే, ప్రక్క బోనులోని సింహం దర్జాగా పడుకుని వుంటుంది. బురదగుంటలో హిప్పో పొటమస్ దొర్లుతూ వుంటే, ఖడ్గమృగం చల్లదనానికి నీటి గుంటలో పడుకుని వుంటుంది. ఏమిచోద్యం — చారల గుర్రాలు, జిరాఫీలు, తోక లేని కోతులు, పండుజుత్తు ఎలుగుగొడ్లు, ఏనుగులు, ఒంటెలు గల యీ చిన్న ప్రపంచం! రోజూ యిక్కడకు జనం తండోప తండాలుగా వచ్చి చూచి ఆనందిస్తుంటారంటే వింతేమిటి! చూడడమే కాదు ప్రేక్షకుల్లో చాలామంది గడ్డి మైదానంలో విందులు గుడిచి, ఫలహారాలుచేసి టీ త్రాగుతారు. వీరు త్రాగేది బ్రూక్ బాండ్ టీయే; యాత్రీకుల వినోద, విలాసకారుల ప్రియ పానీయం. అవును మరి, దేశంలో ప్రతిచోటలాగే కలకత్తా ప్రజలకు కూడా బ్రూక్ బాండ్ టీ అంటే మహా యిష్టం.

'జూ' లోని వింత వింత అడవి జంతువులు ప్రేక్షకు లను, రంజింపచేస్తే, తోట పదును తాజా అయిన కమ్మని బ్రూక్ బాండ్ టీ వారికి అలసట తీర్చి ఉత్సాహము, ఉల్లాసము నిస్తుంది.

బ్రూక్ బాండ్ ఇండియా ప్రైవేట్ లిమిటెడ్

BB 296

Photo by P. R. Shinde



బహుమతి
పొందిన వ్యాఖ్య

కలదులే ఇందు

పంపినవారు :
బి. కృష్ణమూర్తి - కారంచేడు

